# ఇందువచ్చు పాత్రలు.

1-వ అంకము.

1. సూత్రధారుఁడు
2. మారిషుఁడు
3. అర్జునుఁడు
4. దుర్యోధనుఁడు
5. శ్రీకృష్ణుఁడు

2-వ అంకము

1. శ్రీకృష్ణుఁడు
2. పంచపాండవులు
3. ద్రౌపది

3-వ అంకము

1. వృద్ధపురోహితుఁడు
2. ద్వివేది
3. ధృతరాష్ట్రుఁడు
4. భీష్ముఁడు
5. నారదాదులు
6. శ్రీకృష్ణుఁడు
7. ద్రోణుఁడు
8. కర్ణుఁడు
9. దుర్యోధనుఁడు
10. అశ్వత్థామ
11. వికర్ణుఁడు
12. గాంధారి
13. జమదగ్ని
14. జాబాలి
15. విదురుఁడు
16. కృపాచార్యుఁడు
17. దుశ్శాసనుఁడు
18. సాత్యకి

4-వ అంకము

1. శ్రీకృష్ణుఁడు
2. కుంతి
3. కర్ణుఁడు

5-వ అంకము.

1. పంచపాండవులు
2. శ్రీకృష్ణుఁడు
3. ఉలూకుఁడు
4. రుక్మి
5. పురుషుఁడు
6. ఫణిహారి.

6-వ అంకము.

1. శ్రీకృష్ణుఁడు
2. పంచపాండవులు
3. భీష్ముఁడు
4. ద్రోణుఁడు
5. కర్ణుఁడు
6. యుయుత్సుఁడు

పాండవోద్యోగము, పాండవ విజయము అను నాటకపుస్తకములు యీన టైటిలుపేజి యందు నాసంతకములు లేనివి ఎవరైన అమ్మినయెడల వారు క్రిమినలు, సివిలుచర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియజేయడమైనది

(Sd.) దివాకర్ల వేంకటావధాని

# పాండవోద్యోగము

## ప్రథమాంకము

[నాంది]

శా. ధర్మజ్ఞుం డరిభీముఁ డర్జునయశోధాముండు పాపప్రభా
మర్మోచ్ఛిత్తియమాయమానిజనామప్రాభవుం డార్తహృ
చ్ఛర్మోదారుఁడు విశ్వరూపధరుఁడుచ్చైశ్శ్రీనదాన్యుండు స
త్కర్మాఢ్యుండు పార్థసారథి యశఃకల్యాణముల్ గూర్చుతన్.

సూత్రధారుడు—(నాంద్యంతమునఁ బ్రవేశించి) మారిషా! ఇటురమ్మా.

మారి—(ప్రవేశించి) ఇదిగో! వచ్చితి నేమియాజ్ఞ?

సూత్ర—పాత్రంబుల నన్నిటి నాయత్తపఱచితివి గదా?

మారి— చిత్తము. సర్వము సంసిద్ధముగానే యున్నది; గాని మన పాత్రములయం దొక్కరుఁడు మాత్రము మన ప్రతిపక్షి వంచనకు లోఁబడి మనలన్ ద్యజించి యరిగె.

సూత్ర—(తత్తరపాటుతో) ఎవ డతఁడు?

మారి—అన్యుఁడు కాఁడు. తమ మేనమామయే.

సూత్ర—(కోపముతోఁ దనలో) ఓరీ! ప్రతిపక్షీ! ఎంతపని చేసితివి?

ఉ. మున్ను సుయోధనుండు నృపముఖ్యుని ధర్మజు భాగినేయుఁ గూ
డ న్నెఱిఁబోవుశల్యునిఁ గడంగి యెటో యొకయుక్తిఁ బన్ని తాఁ
గ్రన్ననఁ దన్నుఁ జేర్చికొనుకై వడి నాదగు మేనమామ న
త్యున్నతు నాఁచికొంటివె నతుల్ పచరించి హితుంబొనర్చుచున్.

(యోజించి తలపంకించి) కానిమ్ము. నీ కతఁడు సమయము వచ్చినప్పు డంతశ్శల్యాయమానుండై తుట్టతుద కపకృతియే యొనర్చునట్లు

నానేర్పుకల్మిని సంఘటించెదఁ గాక. (ప్రకాశము) మారిషా! అతఁడు లేకున్నను మన నాటకప్రయోగము కొఱఁతపడదు. అతని భూమికను ధరింపఁదగువారు మరికొందరుగలరు. ఏమైనను అతనివంటివాఁడు సామాన్యముగా మనకు లభించుట దుర్లభము. పోఁగాక, గతించినదాని కేమి సేయఁగలము? ఏకాలమున కేది యెట్లుజరుగునో యెవరికిఁ దెలియును? సర్వమును కాలమె సంఘటించుచుండును.

మారి—చిత్తము! తాము వచించినట్లు కాలము ప్రతిక్షణమందునను నేదో మార్పు కల్గించుచునే యుండును; చూడుఁడు.

ఉ. భీమధనంజయప్రభ లభీమము లయ్యెను! బుష్పపల్లవ
క్షేమముఁ బాసి యుండె సహదేవకుజంబు వనంబులోన; వ్యా
యామభరంబునన్ ద్రుపదజాయుత బాష్పఝరంబు నిండె; సం
గ్రామదినంబులున్ దరిసె గాలజధర్మముదాఁట లేమిచేన్.

సూత్ర— అవును, నీవు చెప్పినవన్నియు శరత్కాలజన్యంబులగు మార్పులు, కాలము సర్వకారణమని యార్యులెల్లరును నేకవాక్యతగా నొప్పుకొనిన విషయము.

ఉ. కాలవశంబునన్ దిరుగుఁ గాదె! దివాకరుఁ డబ్జవైరియున్,
గాలవశంబుచేతనె జగంబు జనించు, రహించు, గ్రుంగు; నీ
కాలమె కల్మిలేములకుఁ గారణ; మెన్నిట నెన్ని చూచినన్
గాలము దాఁటువాఁ డిల నొకండును లేఁడు కుశీలవాగ్రణీ!

కానిమ్ము; "గతం నశోచామి కృతం స్మరామి" కావున బ్రకృతమనుసరింపుదము. (యోచించి) నేఁడు నామాతులుం డన్యపతుమునకుఁ బోయినను మనము ప్రయోగింపవలసిన నాటకము పాండవోద్యోగమని తనవర్తనచే సూచించియున్నాఁడు. కాని యీ నాటకచక్రమును ద్రిప్పఁగలవాడు నాబావమఱది మురళీదాసు. అతనిని నీవు పోయి వెంటఁబెట్టుకొని రమ్ము. నే నింతలో నీనాటక

కర్తలగు తిరుపతి వెంకటేశ్వరుల గురువగు శ్రీ చర్ల బ్రహ్మ పండితాఖండలుని సంస్మరించి తత్ప్రసాదంబు వడసి వచ్చెదను.

మారి—చిత్తము. (నిష్క్రమించును.)

సూత్ర—(అంజలి ఘటించి)

శా. కాశీపండితుఁడై కృపాళుఁడయి ప్రఖ్యాతి ప్రభాపూర్ణుఁడై
యాశీర్వాదముమాత్ర శిష్యులను విద్యావంతులన్ జేయువా
డై వైశద్యమ్మునఁబొల్చు చర్లకులజున్ బ్రహ్మయ్య శాస్త్రిన్ గళా
రాశిన్ శ్రీకడిమెద్దవాసు మది నారాధింతు నశ్రాంతముగా.

(నిష్క్రమించును.)

[ ఇది ప్రస్తావన. ]

[అంత నర్జునుఁడు ప్రవేశించును.]

అర్జు—(తనలో)

చ. ద్రుపదునిపంపునన్ జనెఁబురోహితుఁ; డాధృతరాష్ట్రసూతి బల్
కపటి వినండు సంధి చెడఁగా గమకించెడిఁగాని, తప్ప దా
లపుఁబని; సర్వముగా గడపులావు గలండు యశోదపట్టి; యా
రిపుజనకాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్.

(పరిక్రమించి యెదుటఁ జూచి)

కోరుకొమ్మన నేదో యొకవిధమునఁ బోలుతెఱంగునఁ గైకొని

మ. అదిగో! ద్వారక! యాలమందలవిగో! నందంబుఁ గోరాడు; న
య్యది యేకోట. యదేయగడ్త; యవెరథ్యల్; వారలే యాదవుల్
యదుసింహుండు వసించు మేడ యదిగో! నాలానదంతావళా
భ్యుదయంబై వరమందురాంతర తురంగోచ్చండమై పర్వెడున్.

(ప్రవేశము నటించి యాశ్చర్యముతో) ఏమి! యీవిచిత్రము.

క. మనకన్న మున్ను దుర్యో!
ధనుఁ డిట కరుదెంచెఁ గృష్ణుఁ దనవానిగఁ గ్ర
న్ననఁ జేసికొని చనన్ దన!
మనమందుఁ దలంపఁబోలు మందుం డకటా!

వాసుదేవుఁడు పాండవపక్షపాతి! కాదుకాదు. ధర్మపక్షపాతియని సుస్థిరైన నితఁడెఱుఁగఁడు కాఁబోలు. (నిరూపించి)

మ. అరవిందాక్షుఁడు శేషశాయి జగదేకారాధ్యుఁ డంభోధిజా
వరుఁ డార్తావనుఁ డంగజాంగజుఁడు శ్రీవత్సాంకుఁడే మో: నిరం
తరనిర్నిద్రుఁడు నిద్రఁ జెందెడిఁ బనల్; తచ్ఛీర్షపుం బక్క న
క్కూరునాథుం డదె కూరుచుండెఁ దళుకుల్ గుల్కంగఁ బీఠమ్మునన్

[యథోక్తముగా శ్రీకృష్ణ దుర్యోధనులు ప్రవేశింతురు.]

కృష్ణు—(కపట నిద్ర నటించుచుఁ దనలో)

క. రాఁ డాయె నర్జునుఁడు; కురు
రాడవతంసంబు వచ్చె రమ్మని యనికిన్
దోడుగ ననుఁ గోరఁగ మో
మోడంగా వలసివచ్చు నొక్కింత యిటన్.

అర్జు—(భక్తితోఁ దనలో)

మ. జలజాతాసన ముఖ్యదైవతశిరస్సంలగ్న కోటీరపం
క్తుల కెవ్వానిపదాబ్జబీతి కడు నిగ్గుల్ గూర్చుఁ దత్సన్నిధి
స్థలిఁ గూర్చుండి భవంబు పావనము గా దైవాఱఁ గావించి నా
తొలిజన్మమ్మునఁ గూడుపాపముల నాందోళింపఁగాఁ జేసెదన్.

(కృష్ణుని పాదముల ప్రక్క నిల్చుండును.)

దుర్యో—(అర్జునుఁ దేఱిపాఱఁ జూచి తనలో)

ఉ. ఏ నిట కేఁగుదెంచుపని యేర్పడ సర్వము గుర్తెరింగి రాఁ
గా నితఁ డోపుఁ గృష్ణునకుఁ గవ్వడి కేకశరీర మందు రీ
దానవవైరి వీనియెడఁ దా నవమానము చూపునెట్లు? నా
పై నెనరూనునెట్లు? కడు బందుగుఁ డీతని కాతఁ డెమ్మెయిన్

బంధుత్వమ్మున కేమి! కొద్ది గొప్ప నాకును నది లేకపోలేదు! లేక. పోవుఁగాక నేను ముందుగాఁ దన్ను దర్శింపవచ్చితిని. దానిం బట్టి యీతఁడు నన్నవమానించినచో లోకులు 'పక్షపాతి' యని

తన్ను గర్వాంతురని సందియు మందకపోదు. కానిమ్ము సకల
మ్మును నిప్పుడే తేలఁగలదు.

కృష్ణు—(తనలో)

క. నాయనుఁగుంజెలి నాదగు
కాయము నాజీవగఱ్ఱ కవ్వడి నన్నున్
సాయమ్ము గోర వచ్చెన్
నాయంతిస్తాప ముడిగె నను ముద మెనసెన్.

(నిదురమత్తు నటించుచు నర్జునాభిముఖముగా లేచి కౌగలించుకొని
ప్రీతితో)

ఉ. ఎక్కడనుండి రాక యిట? క్షేమమునన్ సుఖులేకదా? యశో
భాక్కులు నీదునన్నలును భవ్యమనస్కులు నీదుతమ్ములున్
జక్కగ నున్నవారె? భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకున్
దక్కక నిల్చి శాంతుగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా?
(ప్రక్కకుఁ దిరిగి దుర్యోధనుం గాంచి గౌరవముతో)

శా. బావా! యెప్పుడు వచ్చి తీవు? సుఖులే భ్రాతల్సుతుల్పుట్టముల్?
నీవాలభ్యముపట్టు కర్ణుఁడును మన్నీలున్ సుఖోపేతులే?
మీవంశోన్నతిఁ గోరు భీష్ముఁడును మీ మేల్గోరు ద్రోణాదిభూ
దేవుల్ సేమమునైరె నెసంగుమరె? నీ తేజంబు హెచ్చించుచున్.

క. నీవచ్చినపనిఁ దెల్పు ము
దావహుఁడవు గమ్ము నాకు;
నఖిలావనిపాలావళిమౌళిమణీసం
భావితచరణుఁడవు నీవు వచ్చుట యరుదే.

దుర్యో—(తనలో) ఇతఁ డర్జునుని సంభావించురీతి యొకవిధముగను
నన్ను గౌరవించు వైఖరి మఱియొక తెఱంగుగను గన్పట్టుచు
న్నది. కానిమ్ము. లోకాచారము గాన నేను వచ్చినపనిం దెల్పె
దను (ప్రకాశముగా) నేను వచ్చి చాలసేపైనది.

ఉ. కౌరవపాండవుల్ పెనఁగుకాలము చేరువ యయ్యెఁ; మాకు న
వ్వారికిఁ గూడ నెక్కుడగుబంధుసముద్రుఁడ వీవు గాన నీ
చేరిక మాకు నిర్వురకు సేమము గూర్చెడిదాట. సాయముల్
గోరఁగ నేగుదెంచితిమి గోపకులైకశిరోవిభూషణా!

క. ఇరువురకు సముఁడ వగు ని
న్నరసితి నేఁ బ్రప్రథమమునం దటుగానన్
సరసిజలోచన! నాకున్
గర మనుకూలుఁడవుగమ్ము కయ్యమ్మునెడన్.

కృష్ణు—కురుకంఠీరవా! నీవు చెప్పినది మిగుల యుక్తియుక్తముగా నున్నది. సర్వవిధముల మీకిరువురకు నేను సాయము చేయఁ దగువాడనే. ఇఁక ముందు వెనుకలం గూర్చి విచారింపుదము.

ఉ. ముందుగ వచ్చి తీవు మునుముందుగ నర్జును నేను జూచితిన్
బందుగు లన్నియంశ మది పాయక నిల్చె సహాయ మిర్వురున్
జెందుట పాడి; మీకు నయి చేసెద సైన్యవిభాగ; మందు మీ
కుం దగుదానిఁ గైకొనుఁడు; కోరుట బాలుని కొప్పు మున్నుగన్.

దుర్యో—(తనలో) ఇతఁ డేదో కుయుక్తి పన్నినను గొంత సాయము చేయక తీరినది కాదు. కానిమ్ము, నాకంతే చాలును.

ఉ. నాకు గదాగురుండు భువనస్తవనీయపరాక్రముండు సు
శ్లోకుఁ డమాయకుండు రిపులోకభయంకరుఁ డస్త్రశస్త్రసం
ధానుశీలుం డుదారగుణధాముఁడు శ్రీబలరామదేవుఁ డీ
పోకలవాఁడు గాఁడు వృథ పుచ్చఁడు మెచ్చఁ డతండు పార్థులన్.
(ప్రకాశముగా) వాసుదేవా! నియిచ్చవచ్చినట్లే కానిమ్ము.

కృష్ణు—ధనంజయా! నీయభిప్రాయ మేమి?

అర్జు—సకలధర్మస్వరూపుఁడ వగు నీ కొరకు చెప్పవలసిన దేముండును?

దుర్యో—(నవ్వి) బావా! నీమాయావచ్ఛక్తిని బాటుపడి యర్జునున కిందు భాగము గల్పించుటయే కాక కోరుకొనుటలోఁగూడ

మొదట నతనికే యవకాశమిచ్చియు "నీయభిప్రాయమే" మనియడుగుచున్నావు. ఇంతకంటె నెవరి యభిప్రాయమైన నేల్లుండెడిని ?

కృష్ణు— సుయోధనా! అట్లు కాదు.

క. నీవు స్వతంత్రుఁడ వీతఁడు
సేవకుఁ డగ్రజుని చెప్పుచేతలకుక్ లో
నై వర్తించెడి; నందుల
కై వేఱుగ నడుగ వలసె నది యట్లుండెన్.

ఇప్పు డీతని నడుగకయే మనకుఁ దోఁచినట్లు భాగము లేర్పఱచి కోరుకొమ్మన నేనో యొకవిధమునఁ దనకుం బోలు తెలుంగునఁ గైకొని చనినమీఁద నయ్యది ధర్మజునికి నచ్చనియెడల "నాను దేవుండు బందుగుఁ డయ్యును మమ్మును వంచించె" నని యన వచ్చును. అట్టియెడ "మున్నాటికిని నీతమ్మునికిఁ జెప్పియే చేసితి" మని ప్రత్యుత్తర మిచ్చుట కవకాశ ముంచుకొనుటకై యిట్లు చేయవలసి వచ్చినది. ఇది యట్లుండుగాక. ప్రకృతము విచారించుకొందము.

తే. గీ. అన్నియెడలను నాకు దీక్షైనవారు
గోపకులు పదివేవు రకుంఠబలులు
గలరు నారాయణాఖ్యఁ జెన్నలరువారు ;
వార లొకవైపు నేనొక్కవైపు మరియు.

క. యుద్ధ మొనరింత్రు వార ల!
బద్ధ మ్మొందులకు! నేను బరమాప్తుడనై
యుద్ధమ్ము త్రోవఁ బోవక !
బుద్ధికిఁ దోచిన సహాయమును బొనరింతున్.

దుర్యో—(తనలో) ఔరా! కృష్ణుఁ డెంత మోసము చేయుచున్నాడు? సేన నంతయు నర్జునున కీయఁదలచి యీపన్నిక పన్నినాడు. ఎంత వెఱ్ఱివాఁడైనను నిప్పట్లఁ దన్నుఁ గోరుకొనునా ?

క. ఆయుధము పట్టడట! యని
 సేయండంట; "కంచిగరుడసేవ" యితనిచే
 నే యుపకృతి యుద్ధార్థిక
 నేయెడ నగు! నిట్టివాని నెవ్వండు గొనున్.

(యోజించి) అయినను బరమాప్తుండగు శ్రీకృష్ణుని విడిచి యర్జునుం డితరము నపేక్షించునా? (తలపంకించి) అపేక్షించనియెడలం గృష్ణుని కపటోపాయ మెల్ల నాకే యుపయోగించుంగాక!

అర్జు—బావా! కోరుకొనవచ్చునుగాదు?

కృష్ణు—కోరికొనవచ్చును. నేను చెప్పిన మాటలు తుట్టతుదివరకు వింటివికాదు? ఇదిగో మరల జెప్పుచున్నాను.

ఉ. ఆయుధమున్ ధరింప నని కగ్గముగా నొకపట్ల నూరకే
 సాయము సేయువాడం; బెలుచ న్ననుం బిమ్మట నెగ్గులాడినన్
 దోయిలి యొగ్గనున్; నిజము తొల్తవచించితిం గోరికొమ్ము నీ
 కేయది యిష్టమో; కడమ యాతని పాలగుం బాండునందనా!

దుర్యో—(తనలో) క. ఇట్టిదొకటి లేకుండిన
 దట్టుండితండు "వట్టిగొడ్డుతాక" ట్టిపుడీ
 కట్టుంటం జేసి; నా కితం
 డెట్టుం దప్పండు నగుదు రెల్లరు నన్నున్.

అర్జు—ఇదిగో గోరుకొనుచున్నాండను.

ఉ. నందకుమార! యుద్ధమున నారథమందు వసింపుమయ్య! మ
 ధ్యందిన భానుమండలవిధంబున నీదగుకల్మిం జేసి నా
 స్యందన మొప్పుం గాక! రిపుసంతతి తేజము దప్పుంగాక! నీ
 వెందును నాయుధమ్ముదరి కేగమి యొప్పునుంగాక కేశవా!

దుర్యో—(సంతోషముతో దనలో) సర్వవిధములం గృష్ణుని కపటోపాయము మనకే యుపకరించినది.

తే. గీ. రథమునం దెన్ని చిత్రంపుఁ బ్రతిమలుండ
వందు శివుఁడును విష్ణువు నజుఁడు నెల్ల
దేవతలు నుండవచ్చు; నాకీవి కృష్ణఁ
డర్జున స్యందన విభూష యగునుగాక!

(ప్రకాశము) బావా! పరిశేష న్యాయమునఁ దక్కినదానినే యేను గైకొంటిని. ఇక నే నరుగుదునా!

కృష్ణు—మంచిది. పోయి రమ్ము.

దుర్యో—(నిష్క్రమించును.)

కృష్ణు—(అర్జునుని వీపుపైఁ జఱచి చిరునవ్వుతో) బావా! ధనంజయ!

ఉ. "ఆలము సేయ నే"నని యథార్థము బల్కితిఁ జుమ్మి యిట్టి గో
పాలుని నన్నుఁ గోరితివి! భండనపండితు లగ్ని తేజు లు
త్తాలధనుర్ధరుల్ బహుశతప్రమితుల్ యదుసింహు లందఱిన్
బాలుగఁ గైకొనెన్ కురునృపాలుఁడు బాలుఁడ వైతి వక్కటా!

అర్జు—(ఆనందముతో) బావా! నీయుద్ధ మేరికిఁ గావలయు! నీవు నా యండ నుండుటయే పదివేలు.

ఉ. "ఉన్నది పుష్టి మానవుల కో యనుభూషణ! యాలజాతికిన్
దిన్నది పుష్టి" నీ వరుగుదెంచి రథంబున నున్నఁ జాలు నే
నున్నముఁ జేసెదన్ రిపులఁ జూపఱు లద్భుత మంద; సర్వలో
కోన్నత! నాకుఁ బేరొసఁగుమూరక చూచుచునుండుమచ్యుతా!

క. నీ తూష్ణీంభావము ప్ర
ఖ్యాతిన్ మాకొసఁగు; నీవ యని చేసిన చో
శీతాంశు నెదుట రిక్కల
భాతిన్ బార్థులకుఁ బేరుబయ లెక్కు నెటుల్?

క. పదివేలలెక్కయే మొక
పదికోటులు వీరు లున్న భర మానీ కే
మెదురైతి మేని జయమున
నిది మెచ్చఁగి మెకొరితిని జుమీ నిను దేవా!

క. గోపాలుఁ డవినఁ దక్కువె
గోపాలుఁడవే నిజంబు గోపాలక! నీ
గోపాలత్వ మొసఁగున్
గోపాలక తాభరంబు గొబ్బునమాకున్.

కృ—(ప్రసన్న భావముతో) ధనంజయా! నీకు నాయందుఁగల భక్తికిం గడు సంతసించితిని.

ఉ. ఊరక చూచుచుండు మను టొప్పితిఁ గాని భవద్రథస్థు నన్
బాఱఁగఁ జూచి నీరిపులు పక్షన నవ్వి యనాదరింతు రా
శూరకులంబు మెచ్చ రిపుసూదన తాభర మూనునీకు నే
సారథి నై యుఁకఁ విజయసారథినామమునన్ జరించెదన్.

అర్జు—(పట్టరాని సంతోషముతో) దేవా! లీలామానుషవిగ్రహా! నేను జిరకాలమునుండి యేది మనంబున నభిలషించితినో అయ్యది యే నీవు ప్రసాదించితివి.

క. బంధుగుఁడనీకు నోయను
నందన! భక్తుండ నట్టి నన్నెటులైనన్
ముందఱకుఁ దెచ్చుభారమ!
నం దేవర దెవఁదుసుకృతి నాకన్నిఁకన్
పూర్ణముగా ననుగ్రహింపఁబడితిని.

ఉ. సారథి యంట! వేదముల సారము శౌరి; తదంఘ్రి భక్తిచె
న్నారెడు క్రీడి తా రథికుఁ డౌనట! చిందము విల్లుఁ దేరునున్
వారువముల్ మొదల్ దివిజవర్గ మొసంగినవంట! యస్త్రవి
స్తారగురుల్ శివాదులఁట! సంగరమం దెవఁ డాగఁజాలెడిన్.

బావా! అన్న నీ రాకకై వేచియుండును గావున నుపప్లావ్యంబున కరుగుదము రమ్ము.

కృ—మంచిది పోవుదము. అర్జునా! మీ సుయోధనుఁ డిప్పు డెక్కడికరిగెనో యెఱుగుదువా?

అర్జు—బలదేవుని సందర్శనమునకని తలఁచెదను.

కృ—నీవనినక్లై! నీవుమాత్రము మాయన్నను సందర్శించి సహాయ మేలకోరవు?

అర్జు—నామనంబునఁ గలయభిప్రాయము వచించెద నాలింపుము.

ఉ. ఈ వొకరుఁడవే జగములెల్ల జయించెద; వేనుఁగూడ న
ట్లే విలయం బొనర్పఁగల; నెందును బేర్గలవాఁడ వౌట నీ
కీ విజయప్రశస్తి యగునేమొ యటంచు మదిన్ దపింతు స
ద్భావముకల్మి నాయభిమతం బొడగూర్చితి; కొండనెక్కితిన్.

మ. బలరాముండు బలాభిరాముఁడతనిన్ బ్రార్థించినన్ వచ్చెబో
కలన న్నీవలె నుండు టొప్పఁ డతఁ డక్కంఠీరవం బెల్ల యో
ధులఁ జక్కాడు మృగావళిన్ బలె; యశోదుగ్ధాబ్ధి నింకొక్క ప్రో
ల్వోలయించుగ దనపేర; నాకు జగతిన్ బేరెల్లు పెంపారెడిన్!

కృ—(నవ్వి) ధనంజయా! అతడు మన కెదురుటిపక్షమున నిల్చినచో నప్పుడుమాత్రము సంగరంబు భారము కాదా?

అర్జు—అగుగాక! నీయనుగ్రహమున్నచో నేలోపమును రాదు.

కృష్ణు—(నవ్వి) నీధైర్యమునకు సంతసించితిని. ఇఁక నిజము వచించెదను వినుము.

ఉ. వచ్చెడి వాఁడు గాఁడతఁడు వారికి మీకునుగూడఁ దోడు; వి
వ్వచ్చుఁడ! యమ్మహామహుని భావము మున్నె యెఱింగినాఁడ; నా
సచ్చరితుండు మీకుఁ దగ సంధి పొసంగిన సంతసించు, నా
యిచ్ఛయునట్టిదే! మనన రేంద్రుని యిచ్ఛయుఁ గూడ నిట్టిదే.

కావున మనమిఁక నిందులకై యత్నింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింప
బడిన పాండవోద్యోగమునందుఁ
ప్రథమాంకము.

---

# పాండవోద్యోగము

## నాటకము

---

## ద్వితీయాంకము

[పిదపఁ బాండవు లైదుగురును ద్రౌపదియుఁ గృష్ణుడును ప్రవేశించుచున్నారు.]

కృష్ణు—దేవా! అజాతశత్రూ! యుధిష్ఠిర!

క. నాతరము కాకయున్నను
చేతులు జోడించుకొనుచుఁ జేసెద దాని
న్నీతలఁపు దెలుపు మఖిల ధ
రాతలపతి మౌళిరత్న రంజితచరణా!

ధర్మ—దేవా! వసుదేవనందన! నీవొనర్చు సంబోధనము భావికార్య సూచకమేమో గాని వానప్రస్థుడనగు నేనిప్పటి కంతులకుఁ దగను.

ఉ. "తమ్ముని బిడ్డలంచు మదిఁ దల్పఁడు పుత్రులలోనఁ గూడ రా
జ్యమ్మున మీకు బాలొఁగఁ డంధనృపాలుఁ"డటంచు నున్న నీ
సమ్ముఖమందఁ దెల్పెఁగద! సంజయుఁ; డాకురురాజు లుబ్ధచి
త్తమ్మునఁ గన్నుఁగానఁడిఁకఁ దప్పదు యుద్ధము బంధునాశమున్.

జయాపజయంబులు దైవాధీనంబులనియు నా దైవంబవగు నీవు మా యెడలఁ గలవనియు నెఱుఁగుదును. అయినను.

ఉ. ఆలును బిడ్డ లేడ్వ నృపు లాలములోఁ గడతేర కెల్ల చు
ట్టాలును రూపుమాయ కకటా! యిల దక్కె—నె! దక్కనిత్తురే!
చాలును రాజ్యభాగము; ప్రజల్ సుఖయించిన నాకుఁజాలు; నేఁ
జాలక కాదు చూవె! తినఁజాలను నెత్తురుకూడు మాధవా!

కృ—బావా! యీ యసమయ నిర్వేదమేల? క్షత్రియ కుమారులకు నెత్తురుకూడుగాక జోలికూడు తినుట ధర్మమా? అయినను నీ యభి

మతం బేదియో నిర్వర్తించుటయే మాకుఁ బరమధర్మము కావున స్పష్టముగాఁ దెలుపుము.

ద్రౌప— తెలుపవలసిన దేమున్నది? మొన్న సంజయుడు "నీకు వారు యుద్ధము చేయనిచో రాజ్యమీయరనియు, నీవు యుద్ధముచేసి రాజ్యము కోరుటకన్న నంధకరాజ్యమందో వృష్ణిరాజ్యమందో బిచ్చమెత్తుకొని జీవించుట కొంతయుక్తమనియు, బోధించెను గదా! అట్లు బిచ్చమెత్తుకొనుచు మధ్యమధ్య వనంబుల కరిగి వెనుకటి వలెనే కందమూలంబు లారగించుచు ఋషులతో ధర్మశాస్త్రంబులు ముచ్చటించుకొనుచు నుండవలసినదనియే మీ బావగారి యభిప్రాయము.

కృ—అమ్మా! ద్రుపదరాజపుత్రీ! చెప్పవలసినదంతయుఁ జెప్పనిమ్ము. (యుధిష్ఠిరుని దిక్కై) దేవా! యుధిష్ఠిర మహారాజా!

ఉ. సంజయు రాయబారమున సార మెఱింగితి మాతఁ డెందు మీ
కుంజను శాంతి, వారలకుఁ గోపమయొప్పెడి; మీకు బిచ్చపున్
గంజి రుచించు, వారలకుఁ గమ్మని పాలు రుచించు; మీకునై
వింజము పుట్టె, వారికై పృథ్వి జనించె నటంచుఁ దెల్పెడిన్.

ఔరా! యీ శుష్క ప్రియములును శూన్య హస్తములును!

క. మా కాయుష్యము మఱియున్
మా కారోగ్యంబు మఱియు మాకు ధనంబున్
మీకు ఋణ మన్న తెఱఁగున
కీ కౌరవనాథు సంధి దృష్టాంత మగున్.

క. పాలికున్నను దమ కం
దాలోఁ బడి తినుట కేని దయ సేయఁడ భూ
పాలుఁడు ధృతరాష్ట్రుఁడు స
చ్ఛీలుం డాతనికి నెవరు చెప్పెడివారల్.

ఈ సంధి సర్వవిధముల "నీకంట నేను వ్రేలిడెదను నా నోట నీవు వ్రేలిడు" మన్నటులున్నది. ఇది యిటులున్నను నీమనంబుయుద్ధమునకు వెనుదీయుచున్నది. అగుగాక! నీనిశ్చయము వ్యక్తీకరింపుము.

ధర్మ—నీ నుడివినదంతయు నిక్కమే; అయినను పితామహ కుంభ సంభవ కృపాచార్య ప్రముఖులు విను నుండఁ బేరోలగమునఁ బుత్ర శత పరివృతుఁడగు మా పెద్దతండ్రితోడ నీవుఁగూడ నొక్కసారి సంధి వచనంబులు విన్నవించిన వినునేమో యని తలచెదను. కావున నన్ను మన్నింపుము.

ఉ. ఇంతకు సంధిమాట విననీ వినకుండగనీ మనంబు ని
శ్చింత మగున్, జనంబు మన సేమము కోరుదురెల్లవారు, నిం
దింతురు వారినిశ్చయము, నిన్ను నుతింతురు, మాకుఁగీర్తి సా
మంత నృపాలురందఱకు మా వ్యవసాయము తేటతెల్లమౌ.

కాన మమ్మీ యాపత్సముద్రము దాటింప కర్ణధారుడవు కమ్ము.

ఉ. సంధియొనర్చి మా భరత సంతతి నిల్పుము, లేద యేని గ
ర్వాంధుల ధార్తరాష్ట్రుల సహాయులతోఁ దునిమింపుమో జగ
ద్బాంధవ! రెండు కర్జముల భారముఁ బెట్టితిమయ్య! నీభుజ
స్కంధమునందుఁ; దారసిలుఁగావుత మాకు యశంబొ రాజ్యమో.

సకల ధర్మస్వరూపుఁడవును సమస్త విశారదుఁడవు నగు నీకు మా యుపదేశం బనావశ్యకము. అయిన నొక్కవిశేషంబు వినుము.

గీ. సౌబలేయులు సంధి కిష్టపడిరేని
అన్నదమ్ముల మేము నూటైదుగురము
పాడియొయి నిష్టపడరేని వారు నూఱు
గురె సహోదరు; లే మైదుగురమె కృష్ణ.

కృ—అట్లు జరుగుటయే దుర్లభము గాని జరిగిన మంచిదియే కదా.

ఉ. మీరును మీరు! నీద్వేషుట మేలగునే ప్రజకైనఁ గాని దు
ర్వారులు ధార్తరాష్ట్రులు భవాదృశు లౌదురె ధర్మరాజ!? నీ
కోరికఁ జేయుఁగూడదనఁగూడదు గావునఁ బోవువాఁడ; నీ
కూరిమి నోరిమిఁ బ్రజలకు న్విదితం బొనరింతు నచ్చటన్.

ధర్మ—(ఆలోచించి) పాపాత్ములగు సుయోధనాదుల కడకు నినువంటి వారిం బనుచుట యుపాయకరంబనియుం దలంచెదను. త్రిలోకాధిపత్యంబేనియుం బాండవులకు నీ సేమమువంటిది గాదుగదా!

కృ—(నవ్వుచు) బావా! అట్లెన్నఁడును సందేహింపకుము.

క. ఉక్కివు లగుకౌరవులుం
దక్కినఁ భూవరులు గలిగినను బ్భావ! నా
ప్రక్కకు రానేర్తురె? యొక
లెక్కయె? నిక్కముగ నేనళిగినంజెప్పుమా

గీ. న్యాయమార్గంబు వినని కర్ణత్రయంబు
గలుగువాఁడు గదా! యట్టి ఖలునియెడల
సంధికుదురు నె యనునొక్క సందియంబె
కాని మనమున నాకొండుకలదె వెఱపు.

ధర్మ—నీకొక్కరివలన వెఱపు లేదనుట సత్యమే, అయినను.

ఉ. దాత్యముపట్ల నీదు దెసఁ దప్పు పనుల్ పచరించు కౌరవ
ప్రాత్యుల రూపుమాపు పని పట్టినఁ బట్టఁగ వచ్చుఁ గాన మీ
సాత్యకి వెంటఁ బెట్టుకొని చన్మచటన్ గృతవర్మ కౌరవా
మాత్యుడె యయ్యెయాదవుడు మాధవ! నీకనుకూలుఁడయ్యెడున్.

భీము—(కన్ను లెఱ్ఱజేయుచు) ఇంతకు సంధి యేమని?

ద్రౌ—(ఎకసక్కెముగా) ఐదూళ్ళిచ్చినఁ జాలునని యంట!

భీము—(తనలో) ఆహా! కాలవైపరీత్యము.

చ. అనుపమ విక్రమక్రమసహాయుల కంతటి పాండురాజనం
దనులకు నొక్కకూళ భరణం బికుచాడ్పున నూళ్ళులైదు ని
చ్చునఁట! కటా! యటుల్బ్రతుకఁజూచుట రాచకొలంబువారికిన్
ఘనతయె? మంత్రరుద్ధ భుజగంబ నిసీ! యిపుడేమి చేయుదున్.

(దుర్యోధనాదుల నెదుట నున్న వారివలెభావించుకొనుచు ప్రకాశము)
ఓరీ! దుర్యోధన దుశ్శాసన హతకులారా!

ఉ. అగ్రజుఁ డంపుగాక! నరకాసుర మారకుఁడేగుగాక! మీ
రుగ్రత మాని సంధి పడ నుందురుగాక! యిదంబుజార్గళో

దగ్రగదా ప్రహారములఁ దప్పదు మృత్యువు మీకు నమ్ముఁడీ
యగ్రజు సంధికి న్నృపతు లందఱిచావమియే ఫలంబగున్.

ద్రౌప—ఏమీ! దుర్మార్గులగు కౌరవు లెదుటనుండి తలపట్టి యీడ్చి కట్టు పుట్టంబు లొలువం జూచుచుండియు నన్ను దిక్కుమాలిన దానింగాఁ జేసిన పార్థమధ్యమున కీయసమయ కోపము! ఔను! అసమర్థులం కెంమును బరోక్షమునందె ప్రగల్భోక్తులు మెండు.

భీము—(ఎదుట జూచి) ఏమీ యిచ్చట వారు లేరా; కోపాంధకారమునఁ గానక యిట్లంటిని. ద్రుపదరాజపుత్రీ! నిజము. అసమర్థులమే! కాదేవి.

మ. ఒక దుర్మార్గుఁడు కొప్పు పట్టికొని సర్వోర్వీపతు ల్చూడఁ గొం
కక నీకట్టినపుట్ట మార్యసభ లాగం జూడమే! దాని కూ
రక యున్నట్టికతంబ యస్మదసమర్థత్వంబు వ్యాకువ్వఁగా
సకి! యింకేటికి మమ్ము దూఱెదవు వాచాశూరు లిప్పాండవుల్.

ధర్మ—క్షత్రియసంపతులారా? శాంతింపుఁడు శాంతింపుఁడు! భవితవ్యమెన్నఁడును గాక పోదు.

భీము—శాంతించి చిరకాలమైనది. (గద నేలం బడవైచుచున్నాఁడు.)

కృ—ఆర్యా! ధర్మతనూజ! సంజయుని మాటలు వింటిని. నీ నిశ్చయంబును వ్యక్తపఱచితివి. ఇంకఁ బయనమై హస్తినాపురంబునకుం బోయి నీ యభిమతం బీడేర్పఁ బ్రయత్నించెదను. కాని—

గీ. మోఱకులు కౌరవులు నీతిదూరు లనుచు
జెలిమి ఘటిల్లుటయు ననిశ్చయ మనుచుఁ
దెలిసియుండియు నీబుద్ధి కలఁత పడియె
బురదలోఁ బడ్డయేనుఁగుం బోలె నధిప!

ఉ. మాయకురోదరంబున నమాయికని న్నినుగెల్చి కాంతకుం
జేయఁగ రానియంతపనిఁ జేసి యరణ్యములోని కంపియున్
హాయిగ నుండనీక ఖలులై పలునెగ్గులు పన్నుచున్న యా
దాయులు చిత్తరంచు దయఁ దాల్చెద వెంతటి ధర్మరాజవో?

విక్రమరహితులగు రాజుల కాపదలు మెండనియు నిడుములుపడువాని కదృష్టము దూరమనియు నదృష్టహీనునకు భాగ్యంబు చేకూర దనియు వచించు పెద్దల నీతివాక్యములు స్మృతికిం దెచ్చుకొనుము.

గీ. శత్రుపక్షంబు నిరసించి సంగరంబు
సేయ వదఁ జొప్పు మయ్య! నిశ్చింత మీఱ
నేనుఁగులఁ జంపి జీవింపఁబూనుఁ గాని
నీరసంపద నెపుడు కంఠీరవంబు.

గీ. మానహానికి సహింపరు మహాత్ము
లసువు లైనను విడుచుట కనుమతింత్రు
బూది ముంగాలఁ దన్నుచుఁ బోవుఁ గాని
మంటదరి కేగఁ జూచునే మనుజగణము?

ధర్మ—శాత్రవులు మిగుల బలసంపన్నులు. మనమా! యంతటి బల సహాయము లేనివారము. జయం బెవరికో మనకో తెలియుట దుర్లభము; దానం జేసి సుఖము వైకల్పికము. అని తలఁచి నిశ్చిత సుఖంబగు సంధి సేయుటయే మనకుఁ గర్జంబు.

కృష్ణ—యుధిష్ఠిరా! నీ బలపరాక్రమములును నీ తమ్ముల తేజంబును నీ వెఱుఁగక మాటలాడుచున్నావు.

ఉ. నాల్గుపయోధులో యనఁగ నాలుగుదిక్కరులో యనంగ నీ
నల్గురుతమ్ములుం బ్రమథనాథసమానులు; యుద్ధరంగమం
దల్గిన నెవ్వఁ డోపఁగలఁ డయ్య! భవత్పరిభావవహ్నికిం
గల్గిన వృద్ధి యింక రిపుకాంతల బాష్పము లార్పఁ జూడుమా!

ఇదియు భవితవ్యమునకుం దగిన యుపదేశము గాని నీతలంపున కన్యథా కరణంబు కాదు.

ఉ. ఐనను బోయి రావలయు హాస్తిన; కచ్చటి సంధిమాట యౌ
నైనను శత్రురాజుల బలాబలసంబద చూడవచ్చు నీ
మానసమందుఁ గల్గు ననుమానముఁ దీర్పఁగవచ్చుఁ దాసమా
ధానము మీవిధానమును తాతయు నొజ్జయు విందు రెల్లరున్.

భీము—(బిగ్గరగా) ఓయీ! కురుపాండవసంధివిధానధౌరేయ! పాండవ దూతా! జనార్దనా! మా రాజుగారి తలఁపు వేఱు, నీ తలఁపు వేఱుగనున్నది.

ఉ. యుద్ధము యుద్ధమంచు మది యుబ్బఁగనీశము మానివై యసం బద్ధము లైన వాక్యములు పల్కుకు మం దెవ రెట్టు లాడినన్ గ్రుద్ధుఁడ వౌచు సంధిఁ జెడగొట్టక ధర్మ తనూజు కార్య సం సిద్ధి యొనర్చు మయ్యనఘ సేమమె మాకును సేమమన్నిటన్.

ప్రకృతి దుర్లలితుండును, నాజన్మగా పాండవ ద్వేషియు, నైశ్వర్య మద మత్తుండును, గ్రూర పరాక్రముండును, దురుద్యోగియు, మానియు నగు సుయోధనుండు చచ్చుటకైనఁ దెగుఁ గాని తన మతంబు వదలడు. వాని నైజంబు నీవెఱుంగనిది కాదు.

గీ. ఒక్కొక కులంబు నశియింప నొక్కడొకఁడు
పుట్టుచుందురి పూర్వ మపూర్వ నృపులు
ఖలులు నేటికి గాంధారి కడుపునందు
జనన మందిరి భరత వంశంబుఁ గాల్ప.

కాన జతురుపాయంబునం గాక తక్కిన చతురోపాయంబుల వానిఁ జక్కఁ బఱుపుము.

కృష్ణు—(నవ్వి) ఇవి భీమసేనుని మాటలేనా! (సమీపించి చేతితోఁ జఱచుచు)

గీ. నిదుర వోచుంటివో! లేక బెదరి పల్కు
చుంటివో? కాక నీవు తొల్లింటి భీమ
సేనుడవె కావో? యెన్నఁడీ చెవులు వినని
కనులు చూడని శాంతంబు గానవచ్చె.

చ. "కురుపతి పెందొడల్విరుగఁ గొట్టెద బొమ్మ పగిల్చి నెచ్చు నె త్తురు కడుపారఁ గ్రోలి యసి దుస్మెద దుష్టుని దుస్ససేను భీ కర గదచేత" నంచును బ్రగల్భము లాడితి వల్లనొల్వలో మురల నిదేల యీ పిఱికి మానిసి పల్కులు మృష్టభోజనా!

ద్రౌప—భగినీవత్సలా! నూఱుమాట లాడవచ్చును గాని యొకమాట నెఱవేర్చుట దుర్లభము కదా!

కృష్ణు— ఔను! మానవతీ శిరోమణీ!

గీ. బరువు మోయఁగలేని దుర్బలుఁడు సమయ
మరసి యేకాంతమగుచోటి కరుగుపగిది
నేఁటిదాఁక బ్రగల్భపు మాటలాడి
బెదరుచున్నాఁడు పోరికై భీముడిపుడు.

ధర్మ—(తనలో) ఎట్టెటో చల్లారిన భీమకోపాగ్ని నీ మహానుభావుండె రగులు కొల్పు చున్నాడు. కాన నిటు చేయఁగూడదని మందలించెదను. (జనాంతికముగా) వాసుదేవా! మహానుభావా!

చ. పగ దిగనాడి నావలని భక్తికతంబున గాళ్ళ సంకెలల్
దగులుప లోపల న్వగచు దంతి విధంబున నున్న వానితో
జగడము తెచ్చిపెట్టుకొని శౌర్యముఁ బోరికి నాయతంబు సే
యఁగ నీఁక నున్న దే! మన ప్రయత్నములన్నియు సాగ నేర్చునే!

కృ—ఈ భీమునకుఁ గోపమలంకారమగునట్లు శాంతము కానేరదు. కావునం గోపము వచ్చుటకయి యీ ప్రశంస తెచ్చితిని గాని యథార్థము గాదు.

ద్రౌప—(జనాంతికముగా) అన్నా! దీనశరణ్యా! పాంచాలీ పరిభవక్లేశ మనుభవించుటకుం బాలు పంచుకొను నార్యవృకోదరుని కోపాగ్నియే చల్లాఱిన ద్రౌపది యిఁక దిక్కుమాలినదే సుమీ.

భీము—(ఏకసక్కెముగా) ఓయీ! కురుపాండవసంధివిధాన ధౌరేయ! పాండవదూతా! యదునందనా! యేమంటివి! "బెదరు చున్నాడు పోరికై భీముడిపుడు" అనియా! అవును. పుట్టువుచేతనే శూరకుల భూషణంబవు నీవు నన్ననవలసినదే.

ఉ. పసితనమంద పాలొసఁగ వచ్చిన నాతినిఁ జంపినాఁడనో!
పసరముతోడఁ బోరి బలవంతులఁ లోపలఁ గీర్తి గొంటినో!

ముసలిది మేని చీలికలు మూసిన మానిసి కోడిపోతినో!
మసలితినో! సదా పసులమాటున శౌర్యము నాకుఁ గల్గునే.

కృ—(తనలో) ఇదిగో! భీమమనశ్చైతుప్పథంబునం గ్రోధన్యక్రోధంబు మోసులెత్తుచున్నది. సమయానుకూల వచన రచనాదోహదంబున నప్రతిహతమై దెస లాక్రమించునట్లు కాపించెద. (ప్రకాశము) బావా! భీమసేన! ఉన్నమాటన్న నీకింత యులుకేల? బీరము లాడియాడి సమయమునకు సంధికిం బురికొల్పుచు గదదూరముగా బాజవైచి కూర్చుంటివి కాన నట్లంటి.

భీము— ఓయీ! పరాభిప్రాయానభిజ్ఞా! యుద్ధమునకే బెదరితినో, యన్నగారి యానతికే బెదరితినో తెలిసికొనలేక పోతివి.

ఉ. అంబుధులింకుఁగాక ప్రళయాంతము వచ్చినవచ్చుగాక లో
కంబులు సూర్యచంద్రు లడఁగం దలక్రిం దగుఁగాక గొప్ప క
ష్టంబులు మూఁడుగాఁక పెనుసంపద పెంపఱుఁగాకఁ యెట్టికృ
త్యంబుల నెందునే నడుగు దాఁటరు పాండవులన్న మాటకున్.

కృష్ణు—బావా! సుయోధనుని తొడలు విఱుగఁగొట్టి చంపెదననియు దుస్ససేనుని ఱొమ్ముఁ జీల్చి నెత్తురు ద్రాగెదననియు నీవన్న మాటలు గావా?

భీము—(బింకముతో) అవును నేనన్న మాటలే.

కృ—(చిరునవ్వుతో) ఐనచో భీముడు దక్క దక్కిన పాండవులే యన్నమాట కడుగు దాఁటనివారు.

•భీము—(ఎకసక్కెముగా) ఓయీ! అన్నమాట కనగా నీకర్థమే తెలియక పోయె.

గీ. గొల్ల యిల్లాండ్ర వంచించి కొంపకొంప
కరిగి పాల్వెన్న పెరుఁగు దొంగతితమునన
బొట్టనిండించి జీవించినట్టి వెట్టి
గొల్లనికి నీకు విద్యల గోలయేల.

గీ. ధర్మతనయుండు నడిచినదారిఁగాక
మాఱు ద్రోవను జనుట మా మతము కాదు
లేకయుండిన ద్రౌపది శోకమార్ప
నీవు దిక్కై కృతిఁవన్న గోడేల మాకు.

అర్జు—(తనలో) హాస్య వ్యాపారము మర్యాదలనుగూడ నతిక్రమించుచున్నదే. (ప్రకాశముగా) ఆర్యా! భీమసేన! నేనును సుయోధనుండును రణ సాహాయ్యంబుగోరి యేకకాలంబునం బ్రార్థించినను గొండొక నెపంబుఁ గల్పించి మనయందలి పక్షపాతము చేత మనకు బాసటగా వచ్చిన యీ మహానుభావున్ ధర్తులాడి విరక్తునిం జేయుచున్నావు. అతనిగోడే మనకు సర్వదా కావలసినది.

మ. చెలి చుట్టంబు మహానుభావుఁడు కృపాసింధుండు మాన్యుండుగాక, లఘుత్వంపుఁ బ్రశంసకిం దగునె? నీకార్యంబు సాధించుకోఁగల నైపుణ్యము నీ నెఱుంగ వనునే కాకటు మేనత్త పుత్రుల మంచించుక మేల మాడ దగదే? రోసంబు రాఁబాడియే?

భీము—అర్జునా? నీకు దెలియదు. మేలమాడుటకు దేశకాలపాత్రంబులు లేవా?

మ. బకునిం జంపితి రూపుమాపితి హిడింబా సోదరున్: దుష్టకీచకులం దున్మితి మొన్న నూర్జర: జరాసంధున్ దురాసంధు నేనొకడం జంపితి నాకు భీమునకు వేరొక్కఁడు తోడేల? యెన్నక నన్ని గతిఁ బోరికిం బెదరుచున్నాఁడం చనం బాడియే?

ఉ. పుట్టినదాది పేరయినపోటుతనం బొకయింత లేక రా
పట్టితనంబు జాడఁ గనుపట్టగ నీయక ప్రేవెలందులం
జెట్టకుఁ జేరఁ దీసి పలుచెట్టలు చేసిన యొక్క గొల్లరా
చుట్ట మెఱుంగునే? భువనశూరు సమీరకుమారు బీరమున్

నకు—(తనలో) అన్నగారేలొకో మన్నవకుం దగిన వెన్నునిపై నెన్నఁడును లేని చిన్నతనంబుఁ జూపించుచున్నారు. (ప్రకాశముగా)

ఆర్యా! జరుగఁబోవు నది యొకటియు జరుగుచున్నది మరొక
టియు నగుచున్నది.

క. జనకుఁ డగుపాండు భూపతి
చనినప్పటినుండి యేదొసంగులు రాకుం
డ నిరత మీయన గాదే
మనలను కాపాడుచున్న మానిసి తలఁపన్.

అట్టివాడొక్క మాటయొకసక్కెముసకై యాడిన సహింపరాదా? కాక

ఉ. గొల్లఁడు గొల్లడంచు వినఁగూడని పల్కుల నిట్లు దూఱఁగాఁ
జెల్లునె యీ పరాత్పరుని చెయ్వులెఱింగియు కాదె యన్నయుం
దల్లియు నెప్పుడున్ గురుపదంబుగ నెంతురు దానినైన నీ
యుల్లములోపలం దలఁప వుత్త యసూయికకోపి వక్కటా!

భీము—తమ్ముఁడా? మద్రభూపాల ప్రథమదౌహిత్ర; యేల యీనిర
ర్థకవాక్యములు. మీరందఱ అతని యడుగులకు మడుగులొత్తిన
నొత్తుదురు గాక.

గీ. చావకుండ నితఁడె సంరక్షణముఁ జేసె
నొక్కొ? యక్కతోడ లక్కయింటఁ
గూడఁ దోడువేదమై డాసె నితఁడే
యిడుము లడవులందుఁ గుడుచునపుడు.

సహ—ఆర్యా? కనిష్టసోదరా? ఏల యీ యప్రస్తుత ప్రశంస? మున్నె
న్నఁడును మనకుపకారము చేయక యే పోవచ్చును. ప్రస్తుతమున

ఉ. సాయము చేయవచ్చెఁగద? శౌరి. యతం డొకమేల మాడ న
న్యాయముగాఁ గుటుంబ కలహంబునకుం దిగితీవు చాలు నీ
కోయతనంబు బైటఁబడె గోడలకుం జెవులుండు నయ్యయో?
దాయలు విన్న లోకువగదా! యవి యైనను మిన్నకుండరే.

అదియునుగాక యథార్థ మాలోచించినను:—

ఉ. తాతయునొజ్జయున్ గురులుఁదక్కినజోదులుచూచుచుండఁగాఁ
జాతకు లీఁడబోక మనభార్యను బట్టి పరాభవింప నా

నాతికి మానరక్షణ మొనర్చినయట్టి మహోపకారి ని
న్నీతఁడు శౌర్యహీనుఁ డని యీసడించిన లోప మున్నదే.

భీము—ఛీ! ఛీ! కత్త్రవానిచేతఁ గూడ నింత లేసి మాట లనిపించు *కొనుచున్న యీదురభిమానపు బ్రతుకేల! ఇదిగో! ఈగదాదండమునం దల వ్రయ్యలు చేసికొనియెద. (గద పుచ్చుకొని) ఓ గదాదండమా!

చ. వెలఁదినిఁ గొల్వులోఁ బరిభవింపఁగఁ జూచుచు నున్నకూళ చే
తుల నినుఁ దాల్చి నిక్కముగ దుర్యశముం గొనితెచ్చె వీఁకుఁ ద
త్ఫలముగ నేఁడు వానితల వ్రయ్యలుచేసి యశమ్ముఁ గొమ్ము నీ
తలఁపగు వీరపుంగవుని తావుకకుం జని నీకు మ్రొక్కెదన్.

ద్రౌప—(భీముని చేయి పట్టుకొని) ఆర్యపుత్రా! శాంతింపుము శాంతింపుము. పగఱ గెల్చుటయు లేక చచ్చుటయు నాఁడు చేయం దగినవి కాని నేఁడీ వృథాప్రాణత్యాగ మేల? "హాస్యంబునకు దేశకాల పాత్రంబులు లేవా!" యని మీ రుగ్గడించిన పలుకు మిగుల లెస్సపలుకు; పాత్ర మెఱుఁగక మేలమాడిన యీతప్పు శౌరిది కాని మీయది కాదు. నాథా! యీదీనురాలి నేమి చేసెదరు! నా పరాభవానలం బార్పువారెవరు? నే నేకముం దనాథ నగుదునా! ముత్తైదువ నగుదునా? చాలితి రేని మీరైదుగు రేక వాక్యంబున నక్కుఱుకుల పాంసనులం జంపి యంగుటంబు మొదలొ దలవఱకుబగ్గుబగ్గుగ మండుమదీయపరాభవానలంబుఁ జల్లార్పుఁడు. లేదేని రణరంగంబు నందైన వీరస్వర్గ మనుభవింపుఁడు; ఈ రొ క్కటి దుర్మరణంబు వలని ప్రయోజనం బేమి? ఓ దేవా! అజాతశత్రూ! మున్నరణ్యంబునఁ జెలియలి వానిదైనం దలంపక నన్నుం జెఱఁగొన్న సైంధవుని గట్టి తెప్పించినగతి నీసుయోధనాదులం గట్టి తెప్పించుటకునైన నీతమ్ములకు సెలవిమ్ము.

భీము—పాంచాలీ! నన్ను వారింపకుము.

ఉ. ఎన్నొయిన్నైన యుద్ధమున కియ్యకొనందు యుధిష్ఠిరుండు. మ
ర్మమ్ములు దూఱనాడుచుఁ "బరాభవమో" యనియేడ్తువీవు! ని
క్కమ్ముగ నీగతిం బ్రతుకుకంటె సుఖంబగుఁ గాక మీఁద దుః
ఖమ్మగుఁ గాక చచ్చుటయె కర్జము మానికి మానినీమణీ!

ధర్మ—(భీముని సమీపించి) నాయనా! భీమసేనకుమార! నీవేల యీ యాత్మహత్యకొడంబడెదవు! ఓ వాసుదేవా! గోరులఁ బోఁదునుమఁ దగినది గొడ్డలితోఁ దునుమునట్లు చేసితివి గదా! ఓ పాంచాలరాజపుత్త్రీ! భీమ కోపానలంబుఁ బ్రజ్వలింపఁ జేయఁ గట్టెలువిఱిచి పెట్టినట్లె మాట్లాడుచుంటివి గదా! ఓ సహదేవకుమార! ఒడలునొచ్చిన నెన్నఁడును నోరులఁ జిన్నమెత్తు మాట యనని వాఁడవు గురువులదెస నా యపచారము?

ఉ. జూదరినై కళత్రమును శోకముపా లొనరించి తల్లి దా
యాదులయింట నుండఁగ మహాటవిపాలయి తమ్ముగుఱ్ఱలం
గాదలిపెంపమున్ వెతలఁ గాంచిన యీబరి యుండ మాని యిం
దేదియు లేని భీముపయి కేగెద వేల గదాప్రహారమా!

కృష్ణ—(తనలో) వ్యవహారము ముదురుచున్నది; కావున మరల భీమసేను నెప్పటియట్ల కావింపవలయు. (జనాంతికముగా) ధర్మతనూభవా! ఏమిది నీకుఁగూడ నీవెఱ్ఱి! ఊరక చూచుచుండుము. ఇంతలో వాయునందనునిం బ్రసన్నునిం జేసెద. (ప్రకాశముగా) బావా! భీమసేన! ఖేద మెఱుంగని మీపెద్దన్నగారి మదికిఁగూడ క్షోభము కల్పించితివి. నీవే యిట్లు సాహసించితివేని—

ఉ. భీకరమై యగాధమయి భీష్మగురుప్రముఖోపలాకులం
బౌ కురురాట్చమూజలధి కడ్డముగాఁ జనఁగా భవచ్చమూ
నౌకను ద్రిప్పఁగాఁదగిన నావికుఁ డెవ్వఁడు! నీవు లేక యీ
శోకము తీఱునే ద్రుపదసూతికి నిక్కము వాయునందనా!

గీ. అన్నమాట లాలించి నీ వన్నమాట
లబ్బురము దోఁపఁ జేయ నేనట్టు లంటిఁ

గాని యెవ్వరు నీపరాక్రమ మెఱుఁగరు
సమయ మిదే వచ్చుచున్నది శౌర్యమునకు.

అదియునుంగాక చిన్నతనంబునుండి దురాత్ములగు సుయోధనాదుల చెడుతలంపులకు నీవ తగియుంటివి.

ఉ. ప్రాటం గట్టిరి నీటఁ ద్రోచిరి విషద్రావంబుఁ ద్రాగించి రా
రాటంబుం బడి "రీవు గీడ్వడినఁ బోరాటం బకించిత్కరం
బాటంకం బసదా" నటంచుఁగద; యాహా! యట్టిశత్రుత్వ మె
ప్పాటం దోఁగితో! యెట్లు సంధియొనరింప న్నన్నుఁ బ్రేరేచితో?

భీము—(కోపము చాలించి) కృష్ణా! మాటిమాటికి నాచేత నేల ప్రేలించెదవు.

ఉ. ఇంతిని గొప్పుఁబట్టికొని యీడ్వఁగఁ జూచితి నెందుచేతనో
వంత దురంతమైన వనవాసముఁ జేసితి నెందుచేతనో
శ్రాంతి వహించి యొక్కనిదెసం గొలువుండితి నెందుచేతనో
శాంతి వహించి యీపగిది సంధి కొడంబడు టందుచేతనే.

ఐనను సంధివచనప్రస్తావంబున నాంబికేయునితో నిట్లనుము.

ఉ. పాండునృపాలకుండు జనవంద్యుఁడు నీయనుజుండు రాజ్య మా
తండె భరించె మున్న చనుదాఁ కిపు డింటికిఁ బెద్ద వయ్యు వం
ధుండవు గాన నీసుతులతో సరిగా ధరఁ బంచిపెట్టి పై
నుండుము నీకుమారుల మహోదయముల్ వినుచున్ సుఖంబుగన్.

అట్లు పంచిపెట్టుట కంగీకరింపవేని.

ఉ. ఆలములోన నీసుతుల నందఱి నొక్క గదాభుజంగికిం
బాలొనరించి వచ్చిన నృపాలురు చూడఁగ నిచ్చువాఁడ నే
నూళుల తిండికిం బ్రతికియుండిన మీకునుఁ 'దాసి' వంచుఁ బాం
చాలిని నవ్వినట్టి దొరసానికి భానుమతీ వధూటికిన్.

ద్రౌప—నాథా! కార్తికరాకాసుధాకర! తరుణకిరణసమశీలంబులగు నీ చల్లనిమాటలచే నామనోవ్యథ తీఱినట్లే యున్నది.

భీము—ఓ పాండవ గేహిని! పాంచాల రాజపుత్రి

క. కొలది దినంబులలోఁ గురు
కులకాంతల కుటికి బ్రాటి కొలుకులతోడన్
గులికెడు నీ కనుఁ గొలుకులఁ
గలికీ! యానందబాష్పకణములు జారన్.

కృష్ణు—(తనలో) ఇప్పటికి మదించి యాలానం బూడఁబెఱికి చెలరేఁగిన మత్తగజము మరల గట్టుకొయ్యకుం జేరినది. (ప్రకాశము) ఓ అర్జున నకుల సహదేవులారా! మీరు చెప్పవలసిన మాట లేమైన నున్నవా?

అర్జు—గీ. నుడువ వలసినదంతయు నుడివె ధర్మ
తనయుఁ; డీ వేగుచుంటివి దైవమూర్తి.
వింకఁ గొదవేమి సంధిఁ గావింప నొండె
పోరుఁ బొసగింప నొండె నీభార మయ్య;

ఐనను మనుజ సహజంబగు నహంకర్తృత్వంబున నా నుడువు పలుకులుపదేశంబని తలంపక యాకర్ణింపుము.

క. చిరభుక్తమైన నేల న
చిరానుభూత యగు ప్రేయసింబలె బలవ
త్తర మగు విధిచేఁ గాకె
వ్వరు విడువం జూతురయ్య వసుదేవ సుతా!

అందును భీష్మ ద్రోణ కృపా శ్వత్థామ ప్రముఖ నిఖిల మహారథిక సమవష్టంభన ద్విగుణీకృతావక్రవిక్రమ గర్వుండును, నయవినయవశీకృత సకలరాజచక్రతోష్ణూయమాన సంపత్పూరుండును, దుశ్శాసనాది సహోదరశతకభుజావరణసంభావిత సహజధైర్య ప్రాసాదాసాదిత రాధేయాభిధేయ సింహాసనాసీనుండును, సహజదుశ్శీల కపట నయపాయానుశ్రేపీ కృతతాతుండును నగు సుయోధనుం డేల విడుచును?

గీ. వాఁడిములు మోపినం తైన వసుధ యొసఁగ
నను చు సూచించె గద! సంజయుని మొగమునఁ
బాలనక నిక్క మైదూళ్లె చాలుననిన
లబ్ధి లేదుగదా! యేల లాఘవంబు?

అది నా తోఁచిన తెఱంగది యిట్లుండ సభాముఖంబునఁ గులవృద్ధగు గాంగేయునితోడను గులాచార్యుండగు కుంభసంభవునితోడను నా మాటలుగా నిట్లనుము.

ఉ. సూతుని మైత్రిచేఁ బగఘఁ జొచ్చినగొంటు సుయోధనుండు; మీ
రాతనిపట్ల వారగుట న్యాయము! గాండివధారి నయ్యు నే
భీతిలుచుంటి నే మనుచుఁ బెద్దలతో నని సేయువాఁడ నో
తాత! గురుండ! మీరయిన ధర్మము గాదని మందలింపరే!

అట్లు మందలింపఁ జాల రేని—

గీ. పౌత్రులే యొనరించి రపాయ మనుచు
ఛాత్రులే చేసినా రపచార మనుచు
నెడఁదలో దలపోయక యిం డభయము
నదమదించును వాని మా సాయకములె.

కృష్ణు—శమదశాత్రవకులఫణాధరనకులా! నకుల! నీ యభిప్రాయ మేమి?

నకు—జనార్దనా!

గీ. అడవిలో నున్న వేళ రాజ్యాశ మనకు
లేదు, వారికి దుర్బుద్ధి లేదు నిజము;
కష్టములకోర్చి తుదకు భాగంబుఁ గోరు
నప్పటికి వారికిట్టి దురాశ పుట్టె.

ఉ. అహమిక చేత నట్లు కబురంపిన నంపిరి గాక మొన్న గో
గ్రహణమునాఁటఁ గోలె మది గర్వము దోఁగక పోరు పాండవ
ప్రహరణముల్ కరం బొడలిపట్లకు నాఁటిన ద్రోణుఁడుం బితా
మహుఁడును దక్కవారలును మాన్పుదు రేగతి సంధి సేఁతకున్.

పోరికిం గ్రాలు గ్రస్వ్యక్షంచుటకు మనబలంబు మాత్రము సామా న్యమే! ధర్మతనయుండు విల్లుపూని నిలిచిన నెదురువాఁడెవ్వఁడు? తక్కిన పాండవులయు విరాట ద్రుపద దృష్టద్యుమ్న కాశీపతి చేదిపతి ప్రముఖులగు మహాయోధులయుఁ జక్రరక్షకుఁడవగు నీయొక్కయు బలపరాక్రమంబు లెఱుంగని వారె? ధర్మతన యుండు సంధికిం జోరనీఁడను గట్టి తలంపు గలిగి యున్నంత పట్టును వారిట్టి ప్రగల్భంబులే పల్కుచుందు రయినను సంధి నడపుచు యుద్ధమునకుఁగూడ రంధి నడపుచుందుము.

ఉ. పోరికి సిద్ధమై యుఁడుగఁ బోయినవారము గాన వారు మా
దారికి రాకపోవుట విదారిత కౌరవకంఠ రక్తధా
రా రమణీయ రక్తిమ మరాళ కరాళ వృథా కుమార సే
వారతి వీఁగియున్న కరవాలములం బడుయోగ ముండినన్.

[ తెరలోఁ బెద్ద కలకలము తరువాత ]

క. ఆసన్నం బయ్యెను ముర
శాసన ప్రయాణ సమయం బిదె భే
రీ సముదిత మగురవము ది
శా సముదాయంబు వగుల జయముగ మ్రోఁగెన్.

కృష్ణు—ఇదిగో! వచ్చుచున్నాను. చిన్నబావా! సహదేవా! నీ తలంపు వ్యక్తీకరింపుము.

సహ—క. అడిగితిరిగానఁ జెప్పక
విడుచుట ధర్మంబుగాని విషయముగానన్
నుడివెదఁ దప్పొన్నను లో
నిడుకొని నాపల్కులు క్షమియింతు రటంచున్.

ఉ. బీరతనంబు వచ్చెనని పెద్దలు నల్గురు కూడి చేసినం
గా దనరాదుగా కపుడు కౌరవ నాథునితోడ వేడుకన్
జూదములాడి ధర్మతనుజుండు సమస్తముఁ గోలుపోవ భా
గోదయ మేగతిం గలుగునో మన కచ్యుత! నిర్ణయింపుమా.

పాంచాలీ వరరూపముగా నాంబికేయుండె మనరాజ్యంబు మన
కిచ్చెనంటి రేని.

మ. విదితంబే పృథివిం గలట్టి సకలోర్వీనాథులుం జూడ ద్రౌ
పది కయ్యాంధ నృపాలకుండు పరిభావంబైన పైనిచ్చుటల్ ;
గదయున్ గాండివమున్ ధరించు దొరలే కంజాక్షి యార్జించి న
ట్టిది నీ! నీ! యని రోయ కక్కటికకూటిం బెన్మి నాసింతురే ?

పోనీ! మాయ దురోదరంబునన్ గెలిచిన గెలుపు గెలుపు గాదంటి రేని.

మ. అభిమానంబు గలట్టి రాజుల కసత్యాలాపముల్ కూడునే ?
ప్రభువుల్ గారె నలాదు! లీకరణిగాఁ బాటించిరే? గెల్తురే
యుభయుల్ జూదములం! బరాభవము రానోడ్డొందువాఁడేల ధ
ర్మభయంబుం గొని గెల్చువారలది ధర్మంబంచు నగ్గించెదున్ !

కావునఁ బాలుమాట తలపెట్టక బలపరాక్రమంబునకు ఫలంబుగా
రణభేరి మ్రోఁగింపుఁడు.

మ. దొర యొక్కండన నేటిమాట? బలవంతుం డెవ్వఁడో వాని దీ
ధర: పోరన్ జయమో పరాజయమొ రాదా! గెల్చి రాజన్యులం
దఱు మెచ్చన్ ధరయేలుకొందమటు కాదా? చచ్చి స్వర్గంబునం
దిరుగన్ వచ్చును మంచిక్షత్రియుల కింతే యొంటు లేదెన్నటన్.

కృ—(చేతితోఁ జఱచుచు) బావా! చిన్నవాఁడవైనను నామనసు
నచ్చినమాటంటివి.

సహ—వాసుదేవా? యీసంధికి సుయోధనుం డొడఁబడఁడేమో
యని మాయన్నలును నీవును గడుఁ జింతిలుచుంటిరి గాని యతఁ
డంగీకరించుట కేవిధమైన సందేహమును లేదు. ధర్మవిదులైన
మాయన్నలు యశంబు సంపాదింతురుగాక !

ఉ. అన్నలు ధర్మవర్తను లటన్న యశం బొకఁడున్నఁ జాలు వా
రన్నరనాథుస ధికయి యాస వహింతురుగాక వారితో
నెన్నటికేవి యాలమది యే నొనరింపక తీర దట్లు కా
కున్నఁ బరాభవమ్ముడుగునో? తల ద్రౌపది యెత్త నేర్చునో ?

ద్రౌప—అన్నా! దీనశరణ్యా! యీయొడుకయ్యెఁగూడఁ గొంచె మాలింపుము. వేదీమధ్యంబునంబుట్టి ద్రుపదరాజునకుం బట్టినై ధృష్టద్యుమ్నునకు సోదరినై స్వయంవరంబున సకలరాజన్యచక్రంబులం జించి చెండాడిన మేటి దొరలైదుగురకుం గులసతినై యొక్క కులపాంసనుం డంటరాని సమయంబునం గొప్పుపట్టికొని కొల్వులోపలఁ గట్టుపుట్టంబులూడ్చి పరిభవించిన నోర్చితి! పండ్రెండు వత్సరములు వనవాసంబును నొక యేఁడజ్ఞాత వాసంబును సలిపితి; ఇన్ని యిడుములకోర్చి బ్రతికి యున్నందుకు ఫలితముగా నాకౌరవ ఖండఖాలుర చావు వినుట తప్పఁ దక్కిన కల్మిలేముల శాసించువానఁగాను. వేయేల? యిమ్మేటి మగలకుఁ పౌరుషంబు వచ్చునని కదా! నేటికిని దుశ్శాసనార్థచ్ఛిన్నంబులగు తలవెండ్రుకలు ముడువక కట్టుపుట్టంబు విడువక జీవించుచుంటి; ఇప్పటికిని నాప్రతికూలదైవంబు వదలి నా నోములు ఫలింపనున్నవి.

కృష్ణ—అమ్మాయి! యింకఁ జాలింపుము. మనోగతం బెఱుంగుదు.

గీ. మున్ను నీవు సహించిన యన్నినాళ్ళ
సైఁప నక్కఱలేదు సంతాప భరము;
వచ్చుచున్నది నిజము నీవలెనె కురుకు
లస్త్రీలకు గూడ నేడ్చుకాలము పురంధ్రి!

(తెరలో "ఆసన్నం బయ్యెను, మురశాసన" అను పద్యము మరలఁ జదువుదురు)

కృష్ణ—బావలారా! నాకందఱు సెలవిండు. ముహూర్తము డాయ వచ్చినది.

( అందరును కొంతదూరము సాగనంపుదురు. )

ధర్మ—(తలలో) కురుకుల దేవతలారా! ఓ పంచభూతములారా! నాయెడల దయయుంచి మావంశము నాశీర్వదింతురు గాక.

చ. పరమ కృపాళు మా యుభయ పక్షము వారికిఁ జుట్టముం జరా
చరమయ మైన యీ జగము సర్వముఁ బ్రోవఁగఁ జాలువాని ధీ
వరు వసుదేవ నందనుని వారలయొద్దకు సంధి సేయఁ బ్రగ
ల్భుల నిదె పంపుచుంటి బతిమాలుచు యుద్ధభరంబు మాన్పఁగన్.

( ప్రకాశము )

గీ. తిమ్మి యనఁ దిమ్మి యగు నిది బ్రమ్మి యనఁగ
బ్రమ్మియే యగు నీవు. వే పలుకు లేల
యిచ్చవచ్చినయట్లు చేయింపుమయ్య
యిరు తెగలలోనఁ గానివా రెవరు నీకు ?

(అందఱును నిష్క్రమింతురు)

గద్య.
ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింప
బడిన పాండవోద్యోగమునందుఁ
ద్వి తీ యాం క ము.



# పాండవోద్యోగము

## నాటకము

---

### తృతీయాంకము

[ పిదప వృద్ధపురోహితుఁడు ప్రవేశించును ]

వృద్ధు—గాంధారీసహితుండగు నాంబికేయునిచే సపరివారంబుగా మురారిం దమయింటికి యథావిధిగాఁ దోడుకొని రమ్మని నేనే వినియోగింపఁబడియు మధ్యమపుత్రుండగు త్రివేదిం బంపించితిని. పెద్దవాఁడగు ద్వివేదిని రాజాగారంబుననే యుండ నియమించితి; గదా! ఇఁకఁ జంటివాఁడు చతుర్వేదియు నేనును మాయింట కతిథులై చనుదెంచిన మునీంద్రులకుం దగిన యాతిథ్యముఁ గావించుచుంటిమి.

ఉ. ఎన్నఁడు రాని పెద్ద లిపు డింటికి వచ్చిరి వారిడించి నేఁ
జన్న శపింతు రానృపతిసద్మములోసికిఁ; బెద్దవాఁడ నా
ట న్ననుఁ బిల్వనంపి రకటా! యిపు డేమి యొనర్పువాఁడఁ, గా
నున్నది కాకమానదు సుయోధనుఁ డేమియొనర్చునో తుదిన్.

గీ. సత్యవతి పెంచెనఁట మున్ను జనని లేని
పిల్లవానిని మాతండ్రి నెల్లయాజి,
నంబికాదేవి పెంచె నన్నట్లు; నొక్క-
యీడువారము ధృతరాష్ట్రనృపతి నేను.

కావున జిన్ననాఁటి నుండియు నతనికి ముఖ్య మిత్రుండనై పౌరోహిత్యంబు పేరి, సామ్రాజ్యమే యనుభవించితి. శ్రీకృష్ణుని రాక

సంధిగోఱకని యెఱింగి నాతోనేమేమో యాలోచించుటకే కాబోలు వైయాసకి నాకుం గబురంపె; ఇంతకుఁ గోఱుకరాని కార్యాలు సుయోధనాధులు తండ్రి మాట వినరు. భరతకులంబున కేదియో చేటుమూడినది. ఛీ! యింత దిక్కుమాలిన యాశ గూడదు. పాపమా పాండవులు బిచ్చగాండ్రవలె నైదూళ్ళిచ్చినం జాలునఁటగా నేల యీరాదు? సాక్షాత్పరాత్పరుఁడు కృష్ణుఁడు సంధిచేయ వచ్చెనని యంగీకరించునేమో! (పెదవి విఱిచి) అబ్బే! వీనికి గురువు లేఁడు దైవము లేఁడు. వీని నింతనాఁటనుండి యెఱుఁగుదును.

గీ. కర్ణుఁడను కర్ణధారుఁ డేకడకుఁ ద్రిప్పు
నాకడకుఁ బోవుఁ గురునాథుఁడను కలంబు
పలుఁకు లాతనితమ్ము లాపడవ పలుపు
లాదరికె లాగఁ జూచెద రనుకలంబు.

ఓరీ! శకునిగా! యీ భరతకుల నాశంబుఁ దెలుపు తిత్తిరి శకునివి. ఓ రాధాకుమారా! ఒడలి కవచకుండలములు గూడఁ దెగఁగోసి యిచ్చిన మేటిదాతపు శరీరములే వేఱుగాని నీవే సుయోధనుండవు సుయోధనుడే నీవు కావున.

ఉ. ఈగికి వెన్కఁ దీయకు మహీంద్రశయానుఁడు పాండుపుత్ర భూ
భాగము సంధిపేరిటి నెపంబున నిన్నడుగంగ వచ్చెఁ జా

(ఆలోచించి) అయ్యో! ఎంత వెఱ్ఱినైతిని; నిన్నిదియొక్కటియే కోరఁదగనిది.

భాగము మాటటుంచుము సెబా! సవమానము నేయుకొండఁగా
నేగతి వచ్చెనో యటులనే చననిచ్చినఁ జాలుఁ గృష్ణునిన్.

(ఆకాశము వంకకుఁ జెవియొగ్గి తనలో) ఎవరో తలుపుదగ్గఱ బిగ్గరగా నఱచుచున్నట్లున్నారు. (ప్రకాశముగా) ఎవరయ్యా! అఱవబో

కాఁడు, మార్గాయాసంబునం బడలి జటాధారులు కునుకుచున్నారు. (మరల నాకసమువంకఁ జెవియొగ్గి తనలో) ద్వివేది మాటవలె నున్నదే! (ప్రకాశముగా) నాయనా! ద్వివేదీ! పెరటి తలుపు దారిని రమ్ము. ఈగుమ్మము తెఱచుటకు వీలులేదు.

ద్వివేది—(పెరటి తలుపు దారిని ప్రవేశించి) తండ్రీ! నమస్కారము!

వృద్ధు—సుఖీభవ! (ఆశీర్వదించి) నాయనా! మురారిని యథావిధి పురస్సరంబుగా మన త్రివేది ముసలి రాచనగరికిం దోడికొని వచ్చెనా! అచటి విశేషములేమి ?

ద్వివేది—ఇప్పటి కేవియును లేవు.

చ. విదురునితో నెదుర్కొని త్రివేది యొనర్చిన యర్ఘ్యపాద్య సం
పదఁ గొని వారితోఁ గలిసి పట్టణకాంతలు చల్లుసేస లె
ల్లఁ దనశిరంబునం బడ విలాసముగాఁ జనుదెంచెఁ గామినీ
మదనుఁడు శౌరి మత్తగజమందగతిన్ ధృతరాష్ట్రు నింటికిన్.

వృద్ధు—తరువాతఁ దరువాత.

ద్వివేది—మత్సమర్పిత చందన తాంబూలాదులు కరంబునం దాఁకి సర్వశృంగారితంబగు బంగారు గద్దెమీఁదఁ గూర్చుండి చుట్టుం బరివేష్టించి యున్నయాసనంబులనున్న మనదొరలతో నుచిత ప్రసంగంబు గావించుచుఁ గొంత తడవుండి—

క. విదురాదుల యింటికిఁ జని
యెదఁ గాకని లేచి యంధనృపదంపతులం
జదురున వీడ్కొని కుంతీ
సదనమునకుఁ జనియె విదుర సహితుండగుచున్.

వృద్ధు—కన్నకొడుకులు కానలపాలై కుందుచుండ దాయాదులయింటం గుడుచుచు నడలుచున్న కుంతికన్నుల కిదియే మొదటిపండువు. తరువాతఁ దరువాత.

ద్వివేది—తరువాత దుర్యోధన మందిరంబునకుం బోయి యచట "విందారగించు" మని యెంత వేఁడినను బగఱయింటఁ దగదని తగిన సమాధానంబు చెప్పి విదురుని యింట భుజించుటకుం జనియె. నేనును మఱలివచ్చితిని.

వృద్ధు—శ్రీకృష్ణుఁ డేగునప్పటికి రా రా జేమి చేయుచున్నాఁడు.

ద్వివేది—కర్ణ శకుని సైంధవ ప్రముఖులతోఁ గొల్వుదీర్చి యున్నాఁడు.

వృద్ధు—(పెదవి విఱిచి) కావున నే శ్రీకృష్ణుఁడు కౌరవరాజు ననాదరించినాఁడు. అదిగాక మొదటినుండియు బలరామునకు సుయోధనుని యందును శ్రీకృష్ణునకుఁ బాండవులయందును నభిమాన మెక్కుడు. ఈయభిమానముల కతముననే కదా! ఆ పెండ్లి కన్నిచిక్కులు ఘటించినవి ?

చ. "పరమ దరిద్రుఁడే నొసఁగఁ బట్టిని ఫల్గున సూతి" కంచు సం
బరబడి సీరి లక్ష్మణకుమారకు నేరిచియుసంగెఁ బెండ్లి కిం
దరలితి మా వివాహపు విధానము లేమనఁ! జావు తప్పి వ
చ్చిరి దొర, లా ఘటోత్కచుఁడు చేసె వివాహము పార్థసూతికిన్.

ద్వివేది—వెనుక సుభద్రమ్మగారిని కూడ బలరాముఁడు దుర్యోధనునకే యీఁదలంపఁగాఁ గృష్ణుఁడు పార్థునకుఁ బెండ్లి చేసెనని విందుము.

వృద్ధు—అవును, మొదలనుండియుఁ గృష్ణునకుఁ బాండవులయందే పక్షపాతము.

ద్వివేది—నాకు సెలవిండు. త్వరగ భుజించి మరల సభాముఖంబునకీ ఋషులనందరిని వెంట నిడుకొని పోవలయును.

వృద్ధు—రాయబారపు సభయేనా! భీష్మాది కులవృద్ధులును, ద్రోణ కృపా శ్వత్థామాది గురు పరంపరయు, శకుని మొదలగు బంధు

వులును, కర్ణ వికర్ణాది సామంతరాజులును, దుర్యోధనాది కుమారులును గొలువఁ బుట్టినది మొద లాంబికేయుండు చేయు నోలగంబులలో నిదియే నిండోలగంబు. (తెరలో) నేనుగూడ మెల్లమెల్లన నేగుదునా? (ఆలోచించి) కననా! విననా!

గీ. యమకుమారు పల్కు లాలించెద నటన్న
నతనిరూపు చూతునా! యటన్న
కనులు కానరావు; వినరావు కర్ణంబు
లేమి చేయువాఁడ నేగి నేను.

ద్వివేది—అయ్యా! నాకు సెలవిండు; నేను మరల వచ్చి సర్వము వినిపించెద.

వృద్ధు—మంచిది. నేను రవంత సేపు విశ్రమించెద. (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

(పిదప భీష్మ ద్రోణులతో గాంధారీ సహితుఁడైన ధృతరాష్ట్రుఁడు ప్రవేశించును.)

ధృత—(తనలో)

క. దుర్యోధను నంపితి శుభ
చర్యన్ శ్రీవాసుదేవు సభకుఁ బిలువఁగన్
మర్యాదగఁ బిలుచునో యీ
యారే తరుఁ డతనిఁ జెవకి యనుమతి గనునో.

[అంత విదుర సాత్యకుల చేయూఁతఁ గొని శ్రీకృష్ణుఁడును వెనువెంట దుర్యోధనాది దుష్టచతుష్టయమును గృపాశ్వత్థామ వికర్ణులును బ్రవేశింతురు. భీష్మాదులందఱును లేచి నిలుచుందురు.]

భీష్మ—వాసుదేవా! నీవా యాసనము నధిష్ఠింపుము. (చేత జూపును)

కృష్ణ—(చేతఁజూపి) ఈ సభావిశేషములఁ దిలకింపఁగోరి నానాదిక్కు లనుండి మహామును లనేకులు వచ్చియున్నారు. ముందు వారి

కాసనము లేర్పఱచి పిదప మనము కూర్చుండుట యుక్తము.
(ఆకాశమువంకఁ జూచి) మఱియు.

క. నాకమునుండి వచ్చిరి
లోకైకనుతుల్ మునీంద్రలోకము వారిన్
దేఁకువవైయె నర్చించి క
దా! కూర్చుండుటకు మనకు నవకాశ మగున్.

[నారదాదులు ప్రవేశింతురు, అందఱును గూర్చుందురు. కర్ణదుర్యోధను లొంకటేయాసనము నధిష్ఠింతురు.]

కృష్ణు—(చిఱునవ్వునవ్వుచు) మామా! సత్యవతీపౌత్ర! ధార్తరాష్ట్రులకును బాండవులకును సంధి గావించి యీ రాజలోకము నెల్లఁ గాపాడుమని నిన్ను యాచించుటకై పాండవదూతనై నీయొద్దకు వచ్చితిని.

క. తమ్మునికొడుకులు సగపా
లిమ్మని రటు లిష్టపడవయేనియు నైదూ
ళ్లిమ్మని రైదుగురకు ధ
ర్మమ్ముగ నీతోఁచినట్లు మనుపుము వారిన్.

క. తనయుల వినిచెదవో యీ
తనయులతో నేమి యని స్వతంత్రించెదవో
చను మొకదారిని లేదే
నని యగు వంశక్షయంబు నగుఁ గురునాథా!

మ. చదువుల్ నీతియు శాంతి దాంతియు విశేషఖ్యాతియుం జాతురీ
కదనాటోపములుం గలట్టి నృపలోకంబెల్ల నగ్గించు సం
పద సొంపారుకులంబు మీకులము. మీవా రందఱున్ నిత్యస
త్యదయాశాలులు కీర్తి నిల్పుకొనవయ్యా! పాండురాజాగ్రజా!

చ. పతితులు గారు నీయెడల భక్తులు, శూరులు గారు విద్యలం
జతురులు, మంచివారు. నృపసంతతికిన్ దలలోనినాల్కలు, ల
చ్యుతునకుఁ గూర్చువారు, రణశూరులు, పాండవు లట్టివార లీ
గతి నతిదీనులై యడుగఁగా నిఁక నేటికి సంశయింపఁగన్.

ఫలితార్థంబుఁ జెప్పితి నట్లు చేయఁ దలంపనిచో వారేకుఱును ద్రౌప
దియు వేర్వేఱ నీతోఁ జెప్పుమనిన మాటలు ప్రకృతానుపయో
గంబులగుటం జేసి విరమించితి.

ధృత—అల్లుడా! వాసుదేవా! సర్వమెఱింగియు నన్ను నెపపెట్టుచు
న్నావు.

గీ. గ్రుడ్డి నగుటచేతఁ గొంతకాలం జేలెఁ
బుడమిఁ బాండురాజు; కొడుకు లిప్పు
డేలుకోఁ దొడఁగి రీకారణంబున
గ్రుడ్డి దయ్యె మాటకూడ నాకు.

క. కొడుకులు తండ్రుల మాటల
కడుగైనను దాఁట రనెడియశమున కీ భీ
ష్ముఁడె చిట్టచివర మా వం
గడము జనించినది మొదలు కంసధ్వంసీ!

విదు—(జనాంతికము) అన్నా! నిన్న శ్రీకృష్ణుని రాకవిని పరమానం
దంబు నంది యత్యానఘున "కది యిచ్చెద నిదియిచ్చెద" నని
యుప్పొంగితివి కదా! యీ వైడూర్యాను నతనికే యిచ్చితి
ననుకొని యీకయ్యమూఁపరాదా! మనకిట్టిసమయము మరలఁ
దటస్థింపదుసుమా! యోజించుకొనుము.

ధృత—(వినీవినని యట్లూరకుండును.)

కృష్ణు—(తనలో) యీ ముదుసలి యిప్పుడే తన వాచా కౌటిల్య
మును జూపించుచున్నాడు. (ప్రకాశముగా ఎఱుఁగుదునైనను
పెద్దవాఁడవని విన్నవించితి.

ఉ. అట్టికులంబునం బొడమి యట్టి మహాత్ముఁడు పాండురాజు తోఁ
బుట్టినవాఁడుగాఁ బుడమిఁ బొంపిరి వోవఁగ నేలినట్టి నీ
కట్టిన పాప మెట్టిదియొ కష్టము రానయి యుండెఁ బుత్రులం
బట్టి. యదెట్టు లీగెదవో పార్థివసత్తమ! నీతివిత్తమా!

నీ యోపిన క్రొలఁది చెప్పిచూడుము. కార్యము దుర్భరంబు కావున నింగా నీతోఁ గూడఁ జెప్పవలసి వచ్చినది. వారిచే శుశ్రూషనే చేయించుకొనెదవో సంగరమునే చేయించుకొనెదవో యది నీయందున్నయది. ఇందుకు నందులకు వారు సంసిద్ధులై యున్నారు.

ధృత—వాసుదేవా! నాయోపినంత నీయెఁటనే యుపదేశించెద.

కర్ణ—నంద నందనా! అతడు పాపమే గట్టెనో పుణ్యమే గట్టెనో ప్రకృతము మనకది విచార్యము కాదు. అధిక ప్రసంగము గావించుటకుఁ బ్రాజ్ఞులొప్పరు. దూతవై వచ్చినవాడవు నీ వక్తవ్యాంశమేదో చెప్పుకొనుము.

భీష్మ—(కోపములో) ఓయీ! సూతపుత్రా! నంద నందనుని మాట టుంచుము. నీకీ యధిక ప్రసంగమునకై యెవ్వ రధికార మొసంగిరి?

క. చెప్పదొరకన్న విషయం
బొప్పో! తప్పో!మ గింపకుండఁగ నడుమన్
దప్పనుట తగునె సభలో
నెప్పుడు గుణనంతివాని కేనియు గుమతీ

ద్రోణు—రాధేయా! శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని పాపమునకుఁ గారణము చెప్పనే జెప్పినాడు. మఱియున్ జెప్పవలసినఁ జెప్పఁగలడు. నడుమ నీకీ దుందుడు కెందులకు?

చ. సరసముదారి బోకెదిరి శక్తి యెఱుంగక పాడిమాలి భూ
వరునకుఁ గూర్చువాఁడ నని వా యెటువచ్చిన నట్లు ప్రేలఁగా

నుఱు వఱుదెంచునో! యొఱు లహో! యని మొత్తురో! సూతపుత్ర!న
ల్వురు చక్రతో వఁగా నడువఁబో విది యెచ్చటి పాపకర్మమో!

దుర్యో—(ఊరకుండుమని కనుసన్న చేయును)

కర్ణ—(ఎకసక్కెముగా) ఓ కుంభ సంభవా! ముదిమిచే మది తప్పిన
గాంగేయునితో బాటు నీకును మతి పోయెనా యేమి?

శా. కూడుం గుడ్డ యొసంగి ప్రోచు విభు నొక్కండెవ్వఁడో వచ్చి దూ
ఱాడం జూచుచు నూరకుండుటకు ద్రోణాచార్యుఁడో భీష్ముఁడో
కాఁడీ కర్ణుఁడు; లోన నొండుఁ బయి నొక్కండూహ లేకుండ నీ
యోడం బ్రాణములైన నీఁకుటకు నీఁడున్నాఁడు సిద్ధంబుగన్.

ద్రోణు—క. ఆతని వృద్ధత్వమ్మును
నీ తారుణ్యంబు మాకు నీకును ధనువున్
జేతఁ గొనువారి కెల్ల బు
రాతన గురుడైన పరశురాముఁడె యెఱుఁగున్.

అశ్వ—ఓయీ రాధేయా! సుయోధన దయాసంపాదితాంగ దేశ
సామ్రాజ్య ధౌరేయ! సేవకుడవగు నీ కుచితంబులగు ధర్మంబులు
భీష్మాదులకుఁ గూడ నుపదేశించుచున్నావు. న్యాయపక్షపాతు
లకుం బ్రభు చిత్తానుసరణం బనావశ్యకము.

ఉ. గొంటుతనంబుచేఁ దలఁపఁగూడని చెయ్వులు చేసె రాజు నీ
యంటున నిక్కమంచు సభ నందఱకున్ విశదంబు చేసె నీ
కంటస మార! పల్కుబడి కంపచందము లేకయున్న నీ
వింటరపాటుఁ జెందుటకు హేతువు చెప్పుము సూతనందనా!

వికి—ద్రోణాత్మజా! న్యాయపక్షపాతులకుం బ్రభుచిత్తానుసరణం
బనావశ్యకంబని కదా! యిపు డుగ్గడించితివి. కాని యిది యీ
గాంగేయాదులయెడలం బ్రయోగింపఁ దగనిది ఏమంటివేని!

మ. అభిజాతత్వము కల్గు చాన సతి యంపైై యుండఁగా దుర్మదా
త్తళటిం గొల్వున కీడ్చి తెచ్చి కటివస్త్రం బొల్వఁగా "దాసి పీ

సభలో నిందువసింపు" మంచుఁ ద్రౌడ యాస్ఫాలింపఁగాఁజూచి రాజభయంబుం దిగఁద్రావి జేని కిది దుష్కార్యం బనంజాలిరే!

అశ్వ—ఓయీ! వికర్ణ! అది యొక గొప్పకార్యమని సుయోధనాదులం బ్రశంసించిరా? నీవు నాలుగు ధర్మవాక్యములు నాఁడు నుడివినంతనే వారికన్నఁ బెద్దవైతివా! దాని కంతకుం బ్రథమ కారణంబు నీతండ్రియే కదా!

క. మోహితులు కన్నుఁ గానక
సాహసకృత్యములు చేయుసమయంబున ని
ర్వాహకము లగునె వల దని
బాహిరముగఁ జేయు ధర్మవచనము లెందున్.

కావునఁ దులువ లొనరించు దుష్టచేష్టలు నివారింపఁ బూనుకంటెఁ బెద్దల కూరకుండుటయే పరమధర్మము. "ఆత్మ్యాత్మ్యైః పుణ్యా పాపై రస్యైవ ఫలముచ్యతే" యని శాస్త్రంబులు వాకొనుచున్నవి.

చ. చెనఁటులు చేతఁగానిపని చేసి కొలంబునకెల్లఁ గీడు మూఁ
డునటులు మించినందుల కిటు ల్చనుదెంచె ఫలంబు తోడుతో
డన కనుఁగొమ్ము వచ్చిరి హుటాహుటి నేఁటికిఁ బాండురాజునం
దనులు చలంబు మీఱఁ గదనంబునకుం గురురాజుమీఁదికిన్.

దుర్యోధనుండు సకుటుంబముగా నశించునుపాయంబు లంగరాజునకుం దప్పఁ దక్కినవారికిం దెలియవు. లేదేని

ఉ. కచ్చియ మాన్పి కౌరవులఁ గాచుతలంపున సంధి సేయఁగా
మచ్చిక నేగుదెంచి హరి మంచియొ చెట్టయొ చెప్పుచుండఁగా
నచ్చపురాజభక్తి గల డంబయు వెల్లడి చేయుభంగి నీ
మచ్చరి సూతపుత్త్రుఁ డభిమానముచేఁ గలహింప నేటికిన్?

కర్ణ—(ఎకసక్కెముగా) నిరభిమానబ్రాహ్మణకులసార్వభౌమ! లక్షణమాత్రపరిజ్ఞాతధనుర్వేదసార! ఆచార్యపుత్త్ర!

చ. కదనము సేయ వచ్చెదని కండిమి ముకుందునిమాటచొప్పునం
బెదరి సుయోధనుండు తెనబీరము నీరముపాలు చేసినం
బెదరంగ సూతనందనుండు వేడుజు గాండు చతుస్సముద్రముల్
చదరముగల్గు నీపుడమి శాత్రవశూన్యముం జేయకుండఁగన్.

అశ్వ—(పట్టరానికోపముతో) ఓరీ అలీక వాచాల! రాధానందనా! ఇంకెన్నినాళ్లు బీరములు పల్కెదవురా?

మహాస్రగ్ధర.

విలయంభోదాంబుధారావిసరమువలె నుర్వీవియన్మధ్యభాగం
బులు నిండన్ వేలుబాణంబులను వదలు విల్కాని గాండీవి "కర్ణా!
నిలుమోరీ! పాఱుఁబోతా! నిలునిలు" మనుచున్నన్ను వెన్నాడజూడ
న్గలకాలం బేగుదెంచెం గరువము వలదు ద్రుగ్రంపుయుద్ధంబునందున్.

ధృత—తండ్రీ! గురునందన! మనమందఱముం గార్యార్థియై వచ్చిన వాసుదేవు నావలకుం బంపు యోజ యోజింపవలయును గదా! మీకీ యకారణ పరస్పరకలహము లేల? రాధేయా! నీవింక సమాధేయవాక్యంబులకై ప్రత్యింపకుము. పెద్దవాఁడ నని యయిన మీరెల్లరు నావిన్నపము చెల్లింపుఁడు. (చేతులుసాచి వెదకుచు) మాసుయోధనుఁ డెక్కడ నాయనా! దగ్గరకు రమ్ము.

దుర్యో—(తనలో) ఇతఁ డేమేమో కొఱగానిపల్కు లుపదేశించును. కానీ! విందము. (తండ్రిగొద్దఁ గూర్చుండును.)

ధృత—కుమారా! (చేతులతో దగ్గరకుఁ దీసికొని)

మ. ఇంద్రియమర్దనంబు మొదలే దఁగఁ ద్రుంచి మనంబువంచి ని
ష్ఠం ద్రిగుణంబు వాసెడు విచారము సేయుమునీంద్రు లేదయా
సాంద్రమునిరూపుఁ జూచుటకుఁ జాలగ కుందుదు రట్టివాఁడు వ
చ్చెం ద్రుహిణేంద్రవందితుఁడు చేరువకుం బని గల్గి దూతయై.

కావున నయ్యలఘుమాటలు నిరాకరింపక ప్రత్యుత్తరము చెప్పుము.

దుర్యో—నేఁడు క్రొత్త లేమున్నవి? వెనుక సంజయుఁడు చెప్పిన మాటలే యాతఁడును జెప్పెను. అందులకు నే నంగీకరింప నని తెలుఁగనివా రెవ్వరు?

ధృత—తండ్రీ? అట్లుకాదు. భీష్మద్రోణ కృపాశ్వత్థామప్రభృతులగు మనమహారథికు లందఱును సంధికొడంబడుటయందు కృతనిశ్చయు లయి యున్నారు. వారైనను—

శా. "ఐదూళ్ళిచ్చినఁ జాలు మా" కనిరఁ టన్యాయంబుగా నేల దా
యాదద్వేషము? మేటిసంగరము సేయంజాలుదే? నీకుఁ "గ
ర్ణాదుల్ గల్గ భయంబిఁ కేల" యనుధైర్యం బుండెఁగాఁబోలు నేఁ
డేడీ! దెల్పుము కవ్వడింద్రోడుదు వారెవ్వారో? నాముందఱన్.

గాంధా—కుమారా! మీతండ్రిగారిమాటలు వినుము. పెక్కుదేశం బులుండఁగా నైదూళ్ళు వారి కిచ్చినంతనే నీకుఁ గొదవ యగునా! పెద్దలమాట లేలనిరాకరించెదవు? చిరకాలమునుండి తఱచుగా నీకురువంశమున రాజ్యము కనిష్ఠహస్తుంబమందే నిల్చుచున్నది. యయాతిసుతులలో జ్యేష్ఠుండగు యదునృపాలుఁడు మదోన్మత్తుఁ డగుటంజేసి యతనికి రాజ్యంబు రాక పితృభక్తిరతుఁడగుపూరు నరపతి కయ్యదిసంఘటించె. పదపడిమీముత్తాతలు దేవాపిబాహ్లిక శంతనులు మువ్వురలో రోగగ్రస్తుం డగుటకతన జ్యేష్ఠుండు ప్రజా సమ్మతుఁడు గామింజేసి కనిష్ఠుం డయ్యును శంతనుండె పట్టాభిషి క్తుండయ్యె. పిమ్మట దేవవ్రతుఁడు జ్యేష్ఠుండయ్యు మీతాతయగు విచిత్రవీర్యునకు రాజ్యంబు సంక్రమించుటయు మీతండ్రి సమక్ష మ్మునఁ పాండునరపతిరాజ్యభోక్తయగుటయు నీవెఱుఁగనివికావు. కావున లోభం బుడిగి మీరును బంచికొనుచుట శ్రేయస్కరంబు. మమ్ముఁబుట్టతుదకు దిక్కుమాలినవారిఁగా నొనర్పకుము. పెద్దల మాట విని బ్రతుకుము.

ధృత—పుత్రకా! ఇంకొక విశేషముఁ జెప్పెద నాలకింపుము.

గీ. లోకములు భస్మమగు సర్వలోకనుతుఁడు
ధర్మరాజ ల్గైనేని; యతండు సుదురు
ధర్మమున; కాడిబొంకఁ డుదారచరితుఁ
డగదువడకుము యుద్ధంబు తగదు కొడుక!

(జనాంతికము) తండ్రీ! మీయమ్మమాట నిజము.

ఉ. వెనుకటినుండి రాజ్య మది పెద్దకుటుంబములోన నుంట యీ
మనకులమందు లేదు కనుమా! మును శంతనుఁ డెట్టివాఁడొ! మ
జ్జనకునిచంత మెట్టిదియొ! సజ్జనమాన్యుఁడు పాండురాజు తా
జనపతి యౌట యెట్టిదొ! విశాంపతి ధర్మజుఁ డౌట యట్టిదే.

గావున నీవృద్ధాచారంబతనికే రాజుగా నాకు దోపించుచున్నది. నీవు మాఱుమాటాడక సంధి కొప్పుకొనుము. లేనిచో సర్వమును గోలుపోవుటయు లోనగు ననేక కష్టములకు లోనగుదువు.

గాంధా—అయ్యా! వారు తమభాగంబునకై పెనఁగువారుగాని యధర్మవర్తనులుగారు. ధర్మమే జయించు నందురు. అదియునుం గాక పితామహ గురు కృపాచార్యప్రభృతు లందఱు న్యాయ పక్షపాతులు. న్యాయంబున కొడంబడి పండ్రెండువత్సరములు వన వాసంబును నొకయే డజ్ఞాతవాసంబును సలిపి తమతండ్రిపాలికై పోరాడఁ జాలియు బంధునాశనంబునకున్ జంకిక దా? "యైదూళ్ళి చ్చినఁ జాలు" నని మురారి నంపించిరి. అట్టి ధార్మికులయెదుటఁ ద్రిశూలధారి యగుశంకరుండును నిలువనోపఁడు. పద్మాక్షుండు గూడ వారిపట్టై యున్నవాఁడు. కావున నీ నూరుగురుతమ్ములం గాచికొని పాండవసహితుండవై జగంబు నిష్కంటకముగ నేలి కొలుము.

దుర్యో—తల్లిదండ్రులారా! మీరు చెప్పవలసినవారు కావునఁ జెప్పిరి. కాని.

క. ఐదూళ్ళిచ్చినఁ జాలును
లేదే నని నేఁత నిజము లెం డనుచున్ దా
యాదులు కబు రంపిన నే
నీఁదలచుట వారి కోడుటే! యగుఁ గాదే?

వినను బెద్దలమాటలు నిరాకరింపక యిచ్చితినే యనుకొనుఁడు.

గీ. మొదటినుండియు మేము మేమును బరస్ప
రాపకార మొనర్చికొన్నట్టివార

మైత్రి మేగతి గలియు నన్యోన్యమైత్రి
లోనిపగలును బయలిచెల్మలునుగాక !

వారీ బలవంతులై మమ్మెం జెనకుదు రని కలలోనైనం దలంపకుండు.

చ. సమరము చేయరే బలము చాలిన! నల్వురుఁ జూచుచుండఁ బెం
డ్లము పెరవారిచేఁ గటకటం బడఁ జూచుచు నూరకుందురే?
మమతయుఁ గొంకు మాన మవమానము సిగ్గును లేనివారి నె
య్యము తిగునయ్య! భూమిపతు లందఱు నవ్వరఁటయ్య! చేసినన్.

శా. రాధేయుండును నేను దమ్ములును సంగ్రామంబులో నిల్వ నా
కాధీశుం డదుదెంచుగా కెదుర శక్యంబే! వృథాభ్రాంతి గా
నీ! ధర్మంబని కాన కేగుదురె పంద్రెండేండ్లు తేజోబల
ప్రాధాన్యంబు గలట్టి రాచకొడుకుల్ పౌరవ్యవంశాగ్రణీ!

అదియునుం గాక.

క. తమ్మునితనయులకుం బా
లిమ్మనెద వయో యమానిలేంద్రాశ్వినులో
తమ్ములు పాండునృపాలుఁడొ
తమ్ముఁడు వివరింపుమయ్య తండ్రీ! నీకున్.

గాంధా—నాయనా నీ కా యప్రస్తుతప్రశంస యేల? తీఁగ కదిపిన డొంకయంతయుఁ గదలును. ధర్మశాస్త్రప్రకారముగ వారలకుం బాలు లేదంటివేనియావచనములు చెప్పియీసభాసదులనొప్పింపుము

జమదగ్ని—(జాబాలితో జనాంతికము) చూచితివా యీగాంధారి చాతుర్యము. పాండవులం గుండులని యాక్షేపించినఁ దనకుమారుల నెవ్వరేని గోళకులని నిందింతురేమో యని యాప్రస్తావన ముగింపుమనుచున్నది. కానిమ్ము. సభాముఖంబునఁ బతివ్రతల నవమానపఱచుట మన కేల ?

జాబాలి—అగును. తొల్లి యీ గాంధారిం బరిగ్రహించినవాఁడు మృతుండగునని కార్తాంతికులు నిర్ణయింప గాంధారధరణీపతి

ముందుగా తనకూఁతు నొక యజపోతమునకుం బెండ్లిచేసెనఁట! పిదప నాంబికేయునకుఁ బరిణయము జేసె. ఎందుఁ జూచినను మహాత్ముల చరిత్రములు విచిత్రములు. అందు గౌరవుల చరిత్రములు మిగుల విచిత్రములు.

దుర్యో—తల్లీ నీవు ధర్మశాస్త్రమని మెత్తుచున్నావు. అస్లేని రాజ్యము జ్యేష్ఠకుటుంబములోనిది గాని కనిష్ఠకుటుంబములోనిది కాదు. తండ్రిగారి యవివేకమువలన మొట్టమొదట వారి కెట్లో యర్ధరాజ్యము వచ్చినది. కావున వారిప్పుడు నాపైకి దాడి వెడలుచున్నారు. ఇది కేవల మధర్మము. నీవు చెప్పినచొప్పున ధర్మమే జయించునేని నాకే జయమబ్బుఁగాక, (యోజించి) నాకాధర్మశాస్త్రప్రశంస యేల! రణంబున జయం బొందెఁ బరాజయఁబొందెఁ గానీ నానిశ్చయంబు వినుము.

గీ. పగఱ గెలిచితినేని యీజగతి నేలు
కొనెద ననుజన్ములను గొడుకులను గొలువ
శత్రువులు గెల్చి రేనియు సపరివార
మనుభవించెద నాకలోకానుభవము.

ఉ. "శౌరి వచించుమాటలకు జంకిన మీయుపదేశము మేము విన్నారముకా" మంటచు మది నాన వహింపకుఁ డమ్మరో! నమస్కారము 'రాజరా' జనుచు సార్ధకభావము దాల్చినట్టి నా పేరు జగంబున న్నిలుప వేఁడెద నట్టు లనుగ్రహింపుడీ.

ధృత—కుమారా! నీవు యుద్ధమందుఁగృతనిశ్చయుండవై యుంటివి. తోఁకఁద్రొక్కిన మహానాగంబులకరణి నీపయి కోఁపుకఁ జనించుచున్న పాండవుల బలపరాక్రమంబులు నాకడుపులోఁ జేయిపెట్టి కలఁచుచున్నవి.

చ. "భరతకులంబు పేరు నిలుపం దగురా" యని తల్లి వేఁడ వ్యాసముని మహామనీషి మనసంతతి నిల్పెఁగదయ్య తాత సం

సరణము రోసియుం బరవసంబునఁ బెంచెఁ గదయ్య దాని నే
లరమరమై కుటుంబకలహంబునఁ ద్రుంచెదవయ్య పుత్రకా!

గాథా—తండ్రీ! వాయునందనుండు జరాసంధ హిడింబ కీచకుల జంపెనని విన్ననాఁటనుండియు నాకడుపు బగ్గుబగ్గున మండుచునే యున్నది. మీసహాధ్యాయులై దుగురలో నొక్కనిచేతం దక్కిన నల్వురుం జావఁగల రని మీగురుండు శపించె నని కూడ విని యుంటిని. అందు భీమసేనునిచేతంబడుటకు నీవొక్కఁడవ మిగిలి యుంటివి: కావున సంధి గావించుకొని నీప్రాణంబులు నిలుపుకొని మమ్మీదుఃఖపారావారముం దాఁటింపుము.

దుర్యో—తల్లీ! కుడిచికూర్చుండక యేల యిట్లమంగళవాక్యము లాడెదరు?

గీ. భరతకులమున కేల లోపంబు రెండు
తెగలవారనిఁ జచ్చు టెందేని గలదె?
సంధి చేసినఁ దప్పునే చావు? గురుని
శాపవచనంబు నిజముగా జరుగునేని.

మ. చన దే నిట్టిఁడ నంచుఁ జెప్పికొనఁ: మీసందేహమున్ దీర్పఁ జె
ప్పనుడు ల్గాని యివి; ద్రోణుని న్గంపుని భీష్మున్ద్రౌణి నెట్టెట్టు లీ
వనిలో నెంచెదొ నన్ను నంత కధికుం డంచెంచుమీ యస్త్రశ
స్త్రనికాయంబులపట్ల బాహుబలధైర్యస్థైర్యశౌర్యంబులన్.

మీ రెంత సేవు చెప్పినను పిచ్చిసంజయునిమాటలు విన్నది మొదలు వారికి దేవతలు గూడ సహాయు లగుదురని చెప్పుచున్నారు. అది కేవలము పొరపాటు. కామక్రోధాదులకువశులై గీర్వాణు లెప్పు డును వర్తింపరు. అట్లువర్తించిరేని వారికి దేవత్వమే నిలువదు. కావున. వారును మనుజులు. మేమును మనుజులము. సర్వవిధ ముల మాబపరాక్రమంబు లెక్కుడు. భవితవ్యమునేను మున్నే నిర్ణయించియుంటి. దాని నాలించి స్వస్థతఁ గైకొనుఁడు.

చ. అని దెగటార్చఁ బాండవుల నండఁజెనిన్ ద్రుపదాత్మజాతుతో
వనరుహనేత్రుతో నృపతివర్గముతో నచిరంబ, సామ్రాజ్యమున్
గని పాలించు యజ్ఞములు. కాంచనముల్ మణులగ్రహారముల్
ఘనులకు నిత్తు విప్రు లఖండవదాన్యులు నన్ను మెచ్చఁగన్.

ధృత—(తనలో) అమంగళము శాంతించుఁ గాక; వాగ్దేవత భావి కాలాను సారిణియై ప్రసరించును గాఁబోలు!

కర్ణ—తల్లీ! గాంధార రాజనందని!

ఉ. తాపసికిం జనించిన కతంబునఁ బోరికి వెన్కఁదీయు నా
లాపము లాడుఁగాక వికలంబుగఁ బుత్రులతోడ తేఁడు; నీ
వే పెడలం గురూరకుల కీర్తినురక్తులు చెప్పబూనితె
ట్లో పరువైన క్షత్రియకుటుంబములో పలిదాన వక్కటా!

ధృత—(తనలో) ఈసూతనందనుని మైత్రియే నాకులంబున కింత చేట్పాటు తెచ్చినది. (కోపముతోఁ బ్రకాశము) ఓరీ! కురుకుల కాంతారదవానలాభిధేయా! రాధేయా! ఇంకేమి చేయించెదవురా!

సీ. కలసి నీరక్షీరములభాతిఁ దనరారఁ దగుబిడ్డలకుఁ బగ ల్దాపి తీవు
ధర్మరాజును మాయధారివై రావించి వంచించిజూద మాడించి తీవు
ద్రుపదమహారాజుదుహితను రచ్చ కీడ్పించి పుట్టంబు లొల్పించి తీవు
కూడుగుడ్డకు దూరగులఁ జేసి పాండవవీరుల నడవి కన్పించి తీవు

గీ. సంధి పొసగింప వచ్చిన శౌరితోడ
నడ్డదిడ్డంబు లాడించి యంపుచుంటి
విచ్చవచ్చినరీతిఁ జేయింపు మీరఁ
భరతవంశంబు బ్రతుకు నీపాలఁబడియె.

గాంధా—మహారాజా! మనసంతానమును మందలింపఁజాలక మొదల దూషించినం బ్రయోజనం బేమి? మీ రన్నమాట మాత్ర మసత్యము కాదు. పాండవమధ్యముని గెలువఁ జాలుదు నను కర్ణప్రగల్భము లే సుయోధనుఁ డిట్లు తెగుటకుం గారణములు.

వికర్ణ—కురుకులేశ్వర! నీకుమారునితో మైత్రిగావించిన రాధేయునకుం దగిన బిరుద మిప్పింతివి.

గీ. దారవు నీకన్నకొడుకులతో సమముగఁ
బెంచితివి మాకుటుంబముఁ బేర్మిమీఱ
నీకుమాటల కెదురాడరాదు గాని
యీవెఱుంగనిపని చేసి రెవరు చెపుమ

పాండవులయం దంతగా నీకు నిక్కమగు వాత్సల్య మున్నయెడల—

మ. పరులం దూఱఁగ నేల! వారి నిటు పిల్వం బంచి యీవేళ యు
ర్వర సర్వంబును ధారవోయఁగ స్వతంత్రత్వమ్ము లేకుంటివో!
ధరణీనాయక! యేల యిట్లతిథిచేతం బాముఁ జపించు నే
ర్పరిచందంబున మెచ్చులాడెదవు? మీవారంద ఱాలింపఁగన్.

అదియునుం గాక—

చ. ఇలఁ గలసర్వరాజుల జయించిన వీరులు పాండురాజపు
త్రులసిరి చూచి యోర్వమి విరోధము పూని సుయోధనుండు వా
రలయెడఁ జేసినట్టియపరాధము లన్నియు సూతపుత్రు నౌ
దలఁ బడవేయు టేనృపతిధర్మము? కౌరవవంశభూషణా!

దుర్యో—కుమార! వికర్ణ! ముదిమిచే మదిదప్పిన యీ మహారాజు మాటల కభిమాన మేల? (తండ్రితో) అయ్యా! నాబహిఃప్రాణంబగు కర్ణ ననుటయొకటియు నన్ననుట యొకటియునా? ఇంకొకసారి యిట్టి కర్ణశూలాయమానంబులగు దుర్భాష లాడితివేని.

గీ. అంబికావంశశాఖ కీ వగు దొకండు
కట్టకడదాఁక గాంధారికడుపు మండు
నవనియంతయుగ్గైవసం బగును బాండు
రాజసుతులకు, నీమనోరథమునిండు.

కర్ణ—(చెవులుమూసుకొని) పాపము శాంతించునుగాక! మిత్రమా ఈమహారాజు వాక్యములు విని నామనసు విఱుగు ననియా

యిట్టి యశ్లీలవాక్యంబు లాడుకొనుచున్నావు? చాలుఁ జాలు; ఇన్నాళ్లు మైత్రి గావించితివి గాని కర్ణుని మనోనిశ్చయంబు గుర్తింపలేక పోయితివి.

ఉ. అర్ణవసప్తకం బొకటియై ధర గ్రుంగిన మిన్ను వంగినన్
స్వర్ణగిరీంద్రముం బగులువాఱిన లోకము తెల్లవాఱినం
బూర్ణదయాసహాయుఁ డయి పోరికి వచ్చి పురారి యడ్డినం
గర్ణుని మేనఁ బ్రాణములు గల్గినఁ బార్థుల చావు తప్పునే.

ధృత—(నిట్టూర్పుపుచ్చి జనాంతికముగా) దేవీ! గాంధారరాజపుత్రీ!

గీ. కుంతికొడుకులు తమ కింత కూడొసంగ
బ్రతుకుమని వ్రాసెఁ గాఁబోలు బ్రహ్మ నొసట
బ్రతుకనీయఁడు వీఁ డొక్కసుతుని నేని
ముసలివాండ్రకుఁ గేలూఁత యొసఁగుకొఱకు.

(గాంధారితొడపై మూర్ఛిల్లును.)

గాంధా—(పైఁటకొంగుతో విసరుచు) తండ్రీ! దుర్యోధన! కుమార! దుశ్శాసన! కుడువనా! ముడువనా! కాలము తీఱినముదుసలులకు మా కేమి కావలయునురా? ఏమిచెప్పినను మీ బాగుకొఱకే కదా! మీశుభోచ్ఛ్రయముఁ జూచుచు నిఁక గొన్నిదినంబులు బ్రతుకఁదలఁచిన తల్లిదండ్రుల నేఁడే గతాసులం జేయుచున్నారా!

(ఏడ్చుచు మూర్ఛిల్లును.)

విదు—సుయోధనా! నీవు విన వని యెఱింగియు నుపదేశపూర్వకంబుగాఁగ నామనస్తాపంబుఁగూడఁ గొంత యుపశమింపఁ జేసికొని యెదను.

ఉ. తల్లికిఁ దండ్రికిం బ్రజకుఁ దప్పని తోఁచిన చేతఁ జేయ నీ
యుల్లము తల్లడిల్లదు వయోభవమైన దురాగ్రహంబునం
గల్లరిమూఁక మాట చెవిఁ గట్టుకొనం దగునయ్య? తమ్ములుం
బిల్లలుఁ జల్లగాఁ దగువివేకము జెప్పిన నేర వక్కటా!

పెద్దలమాట వినుట యుల్లంఘించి సభాముఖంబునం గార్యాకార్యవిచారంబు సేయునపుడు పెక్కుర కనుమతం బగుకార్యంబు చేయందగునని తొల్లి శుక్రాచార్యుఁడు చెప్పిన తెఱంగైనఁ బాటింపుము.

చ. భవదనువర్గమే గద! సభాసదు లందఱు శౌరి ద్రక్కఁ, బాం
డవుల తెఱంగు నీతెఱఁగు నల్వురకు న్విశదంబ కాన నిం
దెవరి తెఱంగు మంచి దని యెక్కువమంది వచింతు రట్ల గా
దవు నని యొప్పి యిచ్చటి సదస్యులు చెప్పినరీతిఁ జేయుమా.

దానికి నంగీకరింతువేని సంఘమరణంబు తప్పుటయు, నీమనోరథంబు సఫలంబగుటయుఁ గూడఁ దటస్థించు; నింకొకవిధానంబు చెప్పెద. తొల్లింటివారు పరస్పరకలహంబులు సంప్రాప్తించునెడ నిరుతెగల నుండి యిరువురు బలిష్ఠులకుఁ దులారణంబు సమకూర్చి వారి జయాపజయంబులచే రెండు వీళ్ళవారును జయాపజయంబులు నిర్ణయించుకొనుటయుఁ గలదు. కావున—

ఉ. వాసవితోడఁ బోరఁగలవాఁ డని కర్ణునియందు నీవు పే
రాస గలట్టివాఁడవు కదా! యిపు డిద్దఱఁ బోరఁ జేసి యం
దోసరినట్టివానిఁ దగ నోడినటు ల్మన మెంచుకొంటిమే
నీ సమరంబు మాను, జగమెల్లరకుం గడుసంతసం బగుఁగా.

భీష్మ—దుర్యోధనా! వినవేర్చితివేని యీకొదుకుని పలుకులు తెన్నె పలుకులు అందుం దులారణంబుమాట మిగులం గొనియాడఁదగినది. ఏమంటివేని—

ఉ. కవ్వడితోడి పోరితము కర్ణున కిష్టము, వానిచేత నా
కవ్వడి నొవ్వఁ జేసి రణకార్యము దీర్చుట నీమనోరథం,
బివ్విధమున్ ఫలించుగద! యిద్దఱకోరిక; తెల్లరాజులుం
జివ్వకుఁ బాసి సంతసముచే మని చూచెద రాలుబిడ్డలన్.

ఇది యట్లుండె నింకొకటి వినుము.

క. ఎన్నఁడు జన్మించితివో
యెన్నఁడు పేరెఁగితివొ యుద్ధ మేటికి? మా కో

యున్నా? ముదుసళ్ళను భగ
వన్నామమునుఁ దలఁచుకొనుచు బ్రతికెద మురద్విట్.

దుర్యో—శాంతనవా! ముదుసలివి కాకపోయినను నీవు మాకు సహాయుఁడవగుదు వనుకొంటిమా యేమి? తులారణంబునం బార్థమధ్యము నక్కడఁగించిన మాకుం బ్రయోజనం బేమి? నేఁడు రాజ్యమంతయుఁ గైవసంబు గాకుంటిమా ?

ఉ. చచ్చినక్రీడి చచ్చినను జావనినల్వురు "మాకు నాలుగూ
ళ్ళిచ్చినఁ జాలు" నం చడుగరే? యపు డందఱు మీరు చెప్పరే?
యిచ్చక మేల యాడెదవు డెల్లరుఁ జూడఁగ జూదమందుఁ గో
ల్పొచ్చినభాగము న్మరల లోఁగొనఁ జూడరె నేఁడు వీరలై ?

అదియుం గాక—

గీ. అయిదుగురు మాకు శత్రువు లంతెకాక
క్రీడి యొక్కఁడొ చచ్చిన కీడుగలదె ?
బ్రతికియుండిన నేగురు బ్రతుకవలయుఁ
జచ్చిరేనియు నేవురుఁ జావవలయు.

ద్రోణా—(చిఱునవ్వునవ్వి) వెట్టివాఁడా! సుయోధన! తులారణంబున నంగరా జప్పుడే విజయు నోడించె ననియే యనుకొనుచున్నావా! అతని బలపరాక్రమములు నీ వే మెఱుంగుదువు;

ఉ. పాశుపతంబుఁ జేకొనియె భర్గుని యుద్ధములో నెదిర్చి, నా
కేశునిలోక మేగి యతఁ డెక్కెనగద్దియ నొక్క, సర్వభూ
మీశుల గెల్చి చేసెఁ బృథివీశ్వరు నగ్రజు నశ్వమేధి; నీ
కాశయ కాని యాలమున నర్జును దాఁకునె కర్ణుఁ డద్దిరా?

క. విరటునిపశువులఁ బట్టిన
తరుణమ్మున నాతఁ డొకఁడు తాఁకిన మన మె
ల్లరగతి యే మయ్యెనో యే
తెరువున నడచితిమొ మఱచితే కురునాథా.

దుర్యో—ఆచార్యవర్య! సర్వజ్ఞులు మీరు సయిత మట్లే సెలవిచ్చిన నే నేమని విన్నవింతును.

ఉ. పాండవపక్షపాతము భవన్మతము న్గబలించెఁ గాక యా
ఖండలనందనుండు తమకంటెఁ బరాక్రమశాలియే! యద
ట్లుండఁగ నెన్నఁడో యయిన యుద్ధముమాటఁ దలంతురయ్య? కా
నిండు మహాత్మ! మీకుఁ గృప యీగతివచ్చిన నేమి చేయుదున్?

భవాదృశులు పాండవులతో సంధి చేయు మనుటకంటె సర్వంబు వారికొసంగి నమ్మే యరణ్యంబునకు లేచి పొండనుట ధర్మము. అనుల్లంఘనీయంబగు మీయానతిచొప్పున సంధియే కావించితి నేని

గీ. ఇరువురు స్వతంత్రు లొక దేశ మేలఁ గలరె?
యతుకునే రెండు ముదిరిన యవనిజమ్ము?
లిముడునే రెండుకత్తు లెందేని నొక్క
యొఱను? నిమిడింపఁ జూచిన గురువరేణ్య!

ద్రోణా—గాంధారేయప్రథమ! మేము పాండవులయెడఁగాని మీయెడలఁగాని భిన్నాభిప్రాయులము కాము. భీమార్జునుల బలంబు లెఱింగియున్నవార మగుటచే నిట్లు చెప్పుచుంటిమి.

క. ముదిసితిమి భోగముల. సం
పదలం గుడిచితిమి మేము బ్రతుకఁదలఁచి యీ
కదనము వల దంచుం జె
ప్పెదమే? వీఱిఁడివి గాక వీరమ్మన్యా

దుర్యో—(సానునయముగా నంజలి బంధించి) ధనుర్నిగమపారావారపారీణ! కుంభసంభవ!

శా. తల్లిం దండ్రియుఁ దాత మీరు మొదలాస్త్రశేశియుం జెప్పుట
స్సల్లాభంబున కే. యెటుల్ రిపులతో సంధింతు సిగ్గేది; చా
వెల్లం బ్రాణుల కున్నదే యెటులనో యేవేళనో యెందా! భీ
తిల్లం బాడియె! మానహానియును గాదే చావు విప్రోత్తమా! (పోవును.)

క. చచ్చెదమో రిపుశీదుల
ద్రచ్చెదమో యెవ్వఁ డెఱుఁగు? రాఁదలఁచినచో
వచ్చి యుని సేసి ధైర్యం
బెచ్చించుచుఁ బగఱ నొంచు మిదె ప్రార్థింతున్.
(నమస్కరింపఁబోవును)

కర్ణ—(దుర్యోధనునిలాగుచు) మిత్రమా! మిత్రుండ నగు నాకుఁ గూడ లజ్జాకరంబగు పని చేయుచున్నావు. బ్రాహ్మణుఁ డని కాని గురువని కాని నమస్కరింతువు గాక!

మ. "అనికిం దోడ్పడుఁ డందు బాఱునొకనిం బ్రార్థింపఁగావచ్చునే?
కనకక్ష్మాధరధీర! కానినువు సంగ్రామాంగణంబందు; నీ
యనుఁగుంగర్ణుఁడు చచ్చెనే! యిటుల దైన్యం బంద నీ కేల! యా
వెనుకన్ దైన్యము చెందెదో! రిపులతోఁ బొందేది సంధింతువో?

అశ్వ—(అహంకారముతో) ఓరీ! సూతచండాల! అట్లయిన నిదిగో నేఁడే చచ్చితివిరా! (మీఁది కుఱుకఁబోవును)

కృ—(అడ్డుపడి) ద్రోణాచార్యపుత్ర! త్రిదివసేనానీసమధామ! అశ్వత్థామ! కోపింపకుము. రణచక్ర మంతయుఁ దన చేతిమీఁదనే త్రిప్పవలయు నను కర్ణుని మనోరథమే చెల్లింపుము.

శా. సేవాధర్మమును సూతధర్మమును రాశీభూతమై యొప్ప వా
చావాత్సల్యముఁ జూపెఁ గర్ణుఁ డిటు మాత్సర్యంబు మీ కేల? రా
జేవేళ న్మిముఁ గోరునో! యునికి నాఁడే పొందు పోరాడ. లే
దా! వర్జింపుఁడు కర్ణు చావువఱకో యత్యంతమో యుద్ధమున్.

కర్ణ—కృపా! నివారింపకుము. కాని మ్మేమి చేయఁగలఁడో చూతును.

అశ్వ—(కోపముతో) ఏమి చేయుదునా! యీపిడికిలితో నీతల వేయి ప్రక్కలు గావించెదను. (కృపుం దప్పించుకొనుచుఁ బైకుఱుకఁ బోవును.)

ద్రో—(వచ్చి పట్టుకొని) తమ్ముఁడా! యేల యింత తొందర?

శా. కోపజ్వాల రగుల్పఁబోకుము దయాకూపార! మాకెల్ల నీ
తాపాయం బగుఁ ద్రోవఁ బోవుము రణవ్యాసంగివై, కార్ముక
వ్యాపారంబు విరోధివర్గముల పైపైఁ జూపి చెండాడు మ
య్యా! పోరాటము పాడియే మనకు నన్యాయం బిటన్యోన్యమున్.

అశ్వ—(కన్ను లింతలుచేసికొని) ఓయీ మూఢమదుర్యోధన! ఇంకను సిగ్గులేక యనునయింప వచ్చితివా? చాలుఁ జాలు.

మ. అనికిం దో డగు నంచుఁ గోరఁ దగడే యాచార్యుఁ! డీసూతనం
దనుఁడా నీకు నియామకుండు? ధరణీనాథుండ వాచార్యపా
దనమస్కారముగూడఁ గూడ దనుచుం దా నీకు బోధించి మా
న్పిన మానం దగువాఁడవే ఖలమతీ! విశ్వాసశూన్యాకృతీ!

ద్రోణా—కుమారా! ఏల రాజదూషణము? ఖలుఁడైనను రాజుం బరిత్యజించుట తగవు గాని దూషించుట తగవు కాదు.

కృష్ణ—మహాత్మా! అట్లు పరిత్యజించుటమాత్రము ధర్మమా?

కర్ణ—ఇట్టివారు పరిత్యజించిన నేమి పరిగ్రహించిన నేమి? (దుర్యోధనునితో) హాస్తిపురసార్వభౌమ!

శా. చాలుం జాలును జేరు చూడ ధనురాచార్యాంక. మాలంబులో
నేలోపంబు ఘటించినం జెడుఁ గదా! యీపెద్దపే రంచు ని
ట్లాలోచించె నెపంబు సంగరపరిత్యాగంబు గావింప; జం
కేలా! పోరికి వీరు తోడుపడువారే యంచు నాశించితే!

అశ్వ—దురహంకారపరిభవిష్యమాణకురుకులరూపధేయ! రాధేయ

శా. మీరంబోకుము పొల్లుమాట! లనికి న్మీరాజు రండంచు మ
మ్మారాధించిననాఁడె వచ్చెదము లేరా!

(ద్రోణాచార్య కృపాచార్యులం జూచి) తండ్రి! రావయ్య, మా
మా! రా పోదము. పోరికై యెవరి నీతిన్మాపాలుఁ డాసించెనో
వారేగెల్తురు వారివారల బలావష్టంభము ల్చూచెదన్.

(దిగ్గన లేచి పోఁబోవును.)

కృష్ణు—కుంభపాత్ర! కృపాచార్యభాగినేయ కించిత్కాల మోపిక చేయుము. అందఱము పోవచ్చును. (దుర్యోధనునితో) బావా! నీకొల్వుకూటము క్రమముగా రణకూట మగుచున్నది. పదుగు రుండఁగనే నాచెప్పఁబోవుపల్కులు గూడ నాలింపుము.

ఉ. చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైఁచి రందఱుం
దొల్లి గతించె, నేఁడు నను దూతగఁ బంపిరి సంధిసేయ. నీ
పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింపఁగఁ బొందు సేసెదో!
యెల్లి రణంబు గూర్చెదవొ? యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!

చ. అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁ డజాతశత్రుఁడే
యలిగిననాఁడు సాగరము లన్నియు నేకము గాకపోవు. క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకులఁ గావు మెల్లరన్.

శా. జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబుంగొని తోలుస్యందనము మీఁద న్నారి సారించుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గునుఁడు మూఁకం జెండుచున్నప్పు డొ
క్కండున్ నీ మొఱ నాలకింపఁడు కురుక్ష్మానాథ సంధింపఁగన్.

శా. సంతోషంబున సంధిచేయుదురె? వస్త్రంబూడ్చుచో ద్రౌపదీ
కాంతం జూచిననాఁడు చేసిన ప్రతిజ్ఞల్ దీర్ప భీముండు ని
ష్పొంతన్ నీసహజన్ము ఱొమ్ము రుధిరమ్ము న్ద్రావునాఁడైన, ని
శ్చింతం దద్గదయుం ద్వదూరుయుగమున్ ఛేదించునాఁడేనియున్.

దుర్యో—(విననియట్లు నటించుచుఁ దనలో) నోటికివచ్చినట్లెల్లఁ బ్రేలుచున్నాఁడు. ముందు వీనిమదమడఁచినం గాని యీపాండవుల మదమడఁగదు. ఇప్పుడే వీనికిం దగిన ప్రాయశ్చిత్త మొనర్చెదఁగాక...

భీష్మ—కుమారా! జగంబు లన్నిటికిని విశేషంబుగ మనకును జుట్టంబగు నీయాదవపట్టభద్రుని మాటలయిన మన్నింపుము.

క. విని చెడితివి మున్నే క
ర్ణునిపలుకులు బంధుజనుల మాటలు గన్నన్
వినక చెడుచుంటి వీ వె
న్నని పలుకులు నేడు నీవు నూర్గురుతమ్ముల్.

దుర్యో—(సాభ్యసూయముగా) తాతా! మీకందఱకుఁ గర్ణునిపై నింత చూపేల?

ఉ. బంధువులైనవారుఁ దిన వచ్చినవారును "బొందు సేయుమీ!
సంధి యొనర్పుమీ" యనుచు జంకి వచించుచు నుండఁగా దయా
బంధురుఁడై మదీయ మగు పద్ధతిఁ కిం దలచూపెఁ గాన నా
బంధువు కర్ణుఁడే యతనిపాటియె తక్కిన వేవురేనియున్.

క. నాతండ్రి పేరుగా దా
సీతనయుం డింతదనుక జేసెఁ బ్రభుత్వం
బీరీతి నాపేరుగ నీ
సూతతనూజాతుఁ డేలుఁ జూడీ రాజ్యంబున్.

కృపా—కురునాథా! నీ రాజ్యమ్మును నీవుసూతతనూజాతునిచే నేలించుకొన్నను మఱియొకనిచే నేలించుకొన్నను సమ్మతమే కాని, నీవెంత రాజవైనను దినవచ్చినవా రని యింత యెల్లిదముగా మాటలాడకుము. నీసొమ్ము తిని యుండుటచేతఁ గదా మావంటి వారి కిట్టి పోటుమాటలు తటస్థించినవి. కాని యింకెన్నినాళ్ళు లే!

చ. కదనమువచ్చె దాఁపునకుఁ గాలము తీఱినవారికెల్ల; నీ
మదిగలకోర్కె తీర్చుటకు మాత్రర దార్కొన కూర కీగతిం
బ్రతుకుచు నిష్ఠురోక్తులకుఁ బాలగువారమె? రాజపుత్ర! నీ
చదివిన విద్యకుం దగినచందము గంటిమి వేయునేటికిన్.

యుద్ధసన్నద్ధుండవై పదుగురు బలవంతుల సహాయము కోరవలసిన దానికి బదులుగా నీవనవలసిన మాటలేనా యివి! బుద్ధి కర్మానుసారిణి' యనుచున్న దిన్నన నేల?

ఉ. చక్కని రాజవంశమున జన్మము నొందినవాఁడ వయ్యయో!
ఱెక్కడనుంచి వచ్చె జగదీశ్వర! సూతునికొల్వు నీకు? నీ
యక్కఱ యేమి యుంచుఁ జెడనాడు మవే? కులవృద్ధు భీష్ము; మా
దిక్కని వేఁడ కిట్లు చెడఁ దీసెదె? ద్రోణుని ద్రోణపుత్రకున్.

నార—కురుకుమారా! యీకృపాచార్యుల మాటలు నిరాకరింపవల సినవి కావు. నీతండ్రి యుండఁ దగుటచే దాసీతనయుఁడైనను సర్వవిధముల లోకోత్తరుండైన విదురుఁడు రాజ్యమ్ము శాసించె. నిఁక నన్యుఁ డిప్పు డేల యేల వలసి వచ్చును? వచ్చెఁబో!

క. ఉన్నారు తమ్ములాపై
నున్నారు మహానుభావు లుజ్జ్వలతేజల్
మిన్నంటువారు పాండవు
లెన్నటికిని గర్ణుఁ డేలఁ డిభపుర మధిపా.

జహాశాపదగ్ధుండగు నీకర్ణుని చెలిమికిం బ్రయోజనంబు భీష్మాదుల తోడి విరోధంబ కాని యొండు గాదు. వీనికిం గలిగిన శాపములు వినుము.

గీ. మాఱువేసంబుతోడ బ్రాహ్మణుఁడ ననుచుఁ
జేరి యీజమదగ్ని కుమారునొద్దఁ
జదివినట్టి దివ్యాస్త్రము ల్సమరమున స్ఫు
రింపఁ బోవని తుదనుశపింపఁబడియె.

అదియునుంగాక—

ఉ. చిన్నతనంబున బ్రథమశిక్షగఁ దూఁపులవేఁత నేర్చుచుం
జన్నపుటావుపై విడచి చంపిన దానిమహీసురుండు ని
ర్భిన్నమనస్కుఁడై యిటు శపించె "రణంబొనరించువేళ నీ
యున్నరథంబు క్రుంగఁబడు నోరి దురాత్మ! ధరిత్రిలోపలన్"

సహజంబులగు కవచకుండలంబు లున్నఁ దనకుమారున కజేయుఁ డని కదా! త్రిలోకపతి యగు యాదేవేంద్రుఁడు కూడఁ బరప్రా

ర్థనా దైన్యం బంగీకరించి వీనిం గోరలూడ్చిన పన్నగంబుఁ జేసి వను వీని బలంబెఱుంగ కున్నావు. ఇది యట్లుండ నింకొకటి వినుము.

ఉ. అందఱు నాకుఁ బేరు కలహప్రియుఁ డందురు నిశ్చయంబుగా
సందడి యున్న నాకుఁ గడుసంబర మెవ్వరి కేని మీఁదికిం
గ్రిందికిఁ బెట్టి పోరు పొసఁగింపన చూచెద నట్టివాఁడ నీ
కుం దగదంటి నాపలుకుఁ గొంచెము నీమది విశ్వసింపుమా.

భీష్మ—(తనలో) అతఁ డంధుఁడు గాని యితఁడు దుర్మదాంధుఁడు. ఇరువురలో నతఁడే మెఱుఁగు. (ప్రకాశము)

మ. అరయన్నేరవు సుంత; నాయదియ రాజ్యంబెల్ల! నే నొల్లమిన్
ధరకుం బాండుఁడు నీదుతండ్రియును భర్తల్ సుమ్ము. నేనుండ ను
ర్వరకున్ మీ రెవ? రేరు పాండవులు! పోరం గారణం బేమి? యి
ర్వూరు నాసమ్మతి కల్మి నేలుకొను టొప్పున్ మెప్పువాటిల్లఁగన్.

విదు—పితామహా! నీ వేల యుపేక్షించెదవు?

తే. గీ. చిత్రకారుని పగిది విచిత్రవీర్య
నందనుని నన్ను రాజ్యమ్మునందు నిల్పి
తీవు మును; ఇప్డు పొమ్మన నేగువార
మంతియే కాని నిన్నెవ డడ్డఁగలఁడు.

క. ఈవు పితామహుఁడవు తా
నేవిధిని బితామహుండు సృష్టించి తగన్
బైవృద్ధిచేసి లయమున్
గావించునో యట్లు మమ్ముఁ గడ కనుపఁ దగున్.

ద్రోణా—సుయోధనా! యిది వినుము.

శా. గాంగేయుం డెది చెప్పె నయ్యది తగన్ గైకోలు సేమంబు గూ
ర్పుం, గార్పణ్యము గాని వేఱొకట నీకుం గాని నాకుండి యీ
సంగాతమ్ముప కియ్యకొమ్మనఁ జుమీ! సర్వమ్ము భీష్ముండె నా
కుం గూర్చెన్ మఱి జీవనమ్మవకు నేఁ గోరన్నినున్ బాధలన్.

క. ఇరుతెగయు నాకు శిష్యులె
యిరుతెగకున్ గురుఁడ నేన యిందెందును నా
కెఱు సింత లేని దైనను
నరుఁ డశ్వత్థామవలెఁ గనం బడుఁ జుమ్మా.

క. ఏ పనియు భీష్ముఁ డని వే
ఱే నీ వనుకోకు మాత్రఁ జెందే నందే
భూనాథ ధర్మ మెందేఁ
దా నిలుచునొ జయము నందె తప్పక నిలుచున్.

జయ—సుయోధనా! వృథా దురహంకారంబునం జెడకుము. యయాతియు నిరుత్మంతుఁడును మున్నగు తొల్లింటి పెద్దలు చెడుట కిదియే ప్రథమకారణము.

క. కులవృద్ధగు గాంగేయునిఁ
కులగురు వగు ద్రోణు నతనికొడుకుం గృపునిం
దలిదండ్రులఁ బరికింపక
బెళుచు లనఁగ నీకు నీవు పెద్దవె చెప్పుమా

ఉ. మక్కువతోడ నిన్ను బతిమాలుచు నున్నకొలంది కర్ణుడే
దిక్కని వీరిపల్కు మదిం జొనీవు దురాత్మతంత్రతన్
వెక్కలి వింత యేమిటికి? భీష్ముఁడు పెట్టినభిక్ష గాదె నీ
కెక్కడిరాజ్య? మయ్యనఘుఁడే ధర యేలఁగ సమ్మతించినన్.

(భీష్మునిదిక్కు మొగంబై) భాగీరథీనందనా! ఈభూమియంతయు నీది గాని యీ చెడుగులది కాదు.

ఉ. రోసితి వెల్ల నీ పని యెఱుంగుదు మైనను నుంతయేని వి
శ్వాసము లేని మోఱకులపైఁ గరుణారస మేల? యేల వి
శ్వాసము నీకు నీమనసు వచ్చినవారి కొసంగుమయ్య! నీ
శాసన మాను గాదనఁగ జాలినవాఁ డెవఁడుర్విలోపలన్.

కర్ణు—(సవ్యాచు) జమదగ్నిమునిచంద్రమా! తపోనిష్ఠాగరిష్ఠులగు శుద్ధ శ్రోత్రియుల కీరాజకార్యప్రసంగ మేల? అంబాంబాల్యంబిక లను

ముచ్చురరాచ కన్నియలం దెచ్చి యం దిరువుర విచిత్రవీర్యునకుం బెండ్లిచేసి యంబ నుభయభ్రష్టురాలిం జేసిన నపుంసకునకు రాజ్య మెక్కడిది? ఏది? మనసువచ్చినవారి కిప్పింపుము.

ఉ. వచ్చినవాడు వచ్చె బలవంతముగా ననిఁ బంచపాండవుల్
చచ్చినఁదాక గర్ణుని ప్రచారము పో, దిపు డెవ్వ రేమి వా
క్రుచ్చినఁ రాజరాజు గయికోఁడు నిజం బెవ రెంతమాట రా
నిచ్చినఁ గొంగు వట్టితి మునీశ్వరులార! బహూక్తు లేటికిన్.

జమ—ఓరీ బాలిశా! శుద్ధశ్రోత్రియులమా? ఇపుడు మాపరశురాముఁ డిక్కడనున్న మా శుద్ధశ్రోత్రియత్వము కనఁబడునురా!

భీష్మ—స్వామీ! సైరింపుఁడు. మీ కుమారుఁ డిట లేఁ డన నేల? యీశిష్య పరమాణు వెవరు? ఆయినను నికృష్టులతోఁ బ్రసంగించుట తగదనియేగదా యేను మిన్నకుంటిని.

జాబా—రథకారకులీన! ఎవ రెంతమాట రానిచ్చినఁ గొంగు వట్టితి విగా! ఇదిగో రానిచ్చుచున్నాను.

ఉ. ఒక్కనిఁ జంపు నంచుఁ బరుహూతుఁ డొసంగినశక్తి ఫల్గునుం
డొక్కఁడుఁదక్కఁ దక్కఁగలయోధుల నొక్కనిఁ జంపుఁగా కతం
డొక్కటి ఖాండవంబు దహియించుచు నున్నపు డొక్కనాగు నీ
దిక్కున డాఁగెనే! యది యదృష్టముచే గురితప్పు గావుతన్!

కర్ణ—(తనలో) అక్కటా! ఈముసలిజడదారి శాపవచనములచే విజయవిజయ సాధకంబులైన నాసాధనంబులు రెండును వ్యర్థము లగుం గాఁబోలును! (ఆలోచించి) ఒరులపైఁ బక్షపాతమునఁ గినిసి బలికినవి ఋషివాక్యములైనను బాటి తప్పకమానవు. (ప్రకాశముగా నిర్లక్ష్యముగా దుర్యోధనునితో) మిత్రమా! యీఋషి యిట్లు పలికెనని బెదరుచుంటివా యేమి? పిన్ననాఁటనుండియు నిట్టి తిట్లనేకములు పడితిని. అవియన్నియు నిజములైనచో నే నిది వఱకే లేకుందును.

దుర్యో—(వినయముతో) మునీంద్రులార! మీకు మేమేమి యప
కార మొనరించితిమి?

ఉ. బాలిశవృత్తి మీ జపతపంబులు పాడొనరింపలేదు. మీ
జోలియుఁ గాని నీఋషుల జోలియుఁ గాని తలంపలేదు,మీ
కేల దురాగ్రహంబు? నృపులెల్లరకున్ భువి ధర్మ్యమైన మా
యాలములోను మిమ్ముఁ దగ వాడఁగ రండని పిల్చినారమే!

దుశ్శా—(జనాంతికము) సహోదరా! యీఋషు లందఱుఁ నూరక
దురాగ్రహంబున శపింప మొదలిడినారు. భీష్మాదు లందఱుఁ
బాండవ పక్షపాతమున ధర్మాధర్మములు తలంపక మాటలాడు
చున్నారు. వీరందఱును దమమాట విననిచో నిన్నుం గృష్ణున
కొప్పగించవలెనని తలఁచుచున్నట్లు నాకు నూహింపనయ్యెడి.

ఉ. ఒప్పఁగింప కిప్పగిది నొప్పులో తప్పులో పల్కి వీరు నీ
యొప్పమిఁ జేయఁగా దలఁచి యుండిరి; కావున నీవు కొల్వులోఁ
దప్పిన దప్పు కీడ్వడుట తప్పదు నాపలు కాలకింపుమా!
యిప్పుడ లేచిపోదము మహీపతి మూర్ఛ తొలంగకుండఁగన్.

దుర్యో—(తనలో) బళిరా! తమ్ముడ; సమయానుకూలమగు నుప
దేశము నొనర్చితివి.

(కర్ణ దుశ్శాసనాదులతో నిష్క్రమించును.)

ధృత—(మూర్ఛ దేఱి యాత్రముతో) ఓరీ దురాత్మ! నే నేమనుకొం
టినో యింతిపనియుఁ జేసితివిరా! (గజగజ వడకుచున్నాఁడు.)

విదు—మహారాజా! ఏల భయపడుచున్నావు? మ జేమియు సత్యాహి
తము రాలేదు. మన దుర్యోధనుఁడు సభాసదులు వచించు
మాటలు వినఁజాలక కొలువులోనుండి లేచిపోయెను.

ధృత—అంతియకద! నిజముగాఁ జెప్పుము. దుర్యోధన దుశ్శాసన
కర్ణ శకునులు నల్వురుం గలసి పరాత్పరుండగు కృష్ణుని మహత్త్వ
మెఱుంగక యతని బంధింప దలచినట్లును. నతడు తన విశ్వరూ
పము జూపించినట్లు నొక స్వప్నముం గంటిని.

విదు—అది యింతవఱకు జరగలేదు. ముందేమగునో! నాకొక్క కష్టాడు స్వప్నములు భావికార్యమును సూచించుచుండును.

కృ—మామా! విచారింపకుము. అట్టిపని యేలజరుగును? జరుగుం గాక! నాకేమి భయము?

గీ. వినిన వినవచ్చు వినకున్న వినకపోవ
వచ్చుఁ గాకిస్సిరో! మనవాడు కొల్వు
వెడలిపోవున యీరీతి వెఱ్ఱి యగుచు
ననుచు వగచుచునుంటి ధరాధినాథ!

గాంధా—(మూర్ఛదేఱి) నాథా! యేమి యీకోలాహలము!

ధృత—దేవీ! నీకొడుకు చేసిన వేఁడుకపని.

భీష్మ—అంబికేయ! గడచినదానికి వగచినఁ బనిలేదు. కలియుగము ప్రవేశించినది. యుద్ధంబు కాక మానదు.

ధృత—దేవీ! నీ వొకసారి మరల సుయోధనుని రప్పించి చెప్పిన వినునేమో?

గాంధా—మహారాజ! మొదటినుండియు దురాత్ముఁడగు వానికి రాజ్య మిచ్చినదానికిఁ దగినఫల మనుభవింపఁ బోవుచున్నారము. వాని దుష్టచేష్టలకు మనమే కారణము. రాజ్యప్రదానమునులభము గాని దుష్టకార్యనివర్తనము కష్టముగదా! పలువుర పరిహాసమునకుఁ బాత్రులమైతిమి! అయినను నా యోపినకొలఁదిఁ జెప్పెద.

ధృత—(విదురునితో) నీ వేగి మీయమ్మ పిలుచుచున్నదని సుయోధనునిం దోడ్కొని రమ్ము.

విదు— చిత్తము. (పోయి దుర్యోధనునితోఁ బ్రవేశించుచున్నాఁడు)

దుర్యో—(వచ్చి) తల్లీ! నమస్కారము! నన్నుఁ బిలిపించిన పనియేమి?

గాంధా—తండ్రీ! దుర్యోధన! సహానుజుఁడ వగునీకు శ్రేయస్కరం బగు నీతండ్రిమాటలు వినుము. గాంగేయ కుంభసంభవ కృపాచార్య విదురాదులు నీక్షేమము కోరనివారు కారు. విశ్వాస

మదృష్టమూలము గాని బుద్ధిసాధ్యంబు గాదు. జితేంద్రియుండును మేధావియుఁ గానివానికిఁ బ్రజాపరిపాలనము సుకరంబుగాదు. పెక్కుఁ గామక్రోధములు శత్రువులు గాని పాండవులని తలంపకుము. మొదట నీవారికే యిష్టుఁడవు గాకిచో రిపుల కెట్లుసాధ్యుఁడ వగుదువు? కన్నులు తెగినవలలోఁ జేపలు చిక్కని పగిదిఁ గామక్రోధములఁ జేఁ దూఁట్లువడిన మహీపతివలలో శత్రువులు చిక్కరు. కావున రిపుషట్కంబు జయించి ప్రపంచకంబని తలంచుచున్న పాండవులతోఁ గలసి యీరాజ్యము సుఖముగాఁ బాలించుకొనుము. కేవలము కలహమునకు జంకి కదా మీతాతయుఁ దండ్రియు వారి భాగము వారికీయఁ దలంచిరి! నిష్కంటకముగఁ బృథివియంతయు నేలఁ దలంచితివేని వారడిగిన ట్లయిదూండ్లయిన వారికిమ్ము. నా యుపదేశము పిష్టపేషణప్రాయ మని యెఱింగియుఁ గన్న కడుపు గావున మరల జెప్పుచుంటిని. మీయందును బాండవుల యందును సమప్రీతిగల శాంతననాములు తమ యావచ్ఛక్తితో సమర మొనర్పకుండుటయే నిక్కము కాన బంధుమరణంబున కొడిగట్టినము.

దుర్యో—తల్లీ! ఐశ్వర్యం బదృష్టసాధ్యంబయి మరణము మాత్రము బుద్ధిసాధ్యమగునా!

ఉ. పాండవులైన నుండవలె భారతవంశము నిల్వ. లేక మే
ముండవలెం; ద్వదీయసహితోక్తికి నిక్కము మాఱు పల్కు లు
న్నుండెఁ గుటుంబనాశకుఁడ ధూర్తుఁడ బుట్టితి సైఁపు మమ్మరో!
ఖండన మాచరింతు బలవంతపు దీవన యిచ్చి పంపుమా.

విదు— మహారాజ! విచిత్రవీర్యనందన!

గీ. సభ్యులకు నెల్ల సెల విచ్చి నరసిజాక్షు
నంపకము చేసి నిజగృహాభ్యంతరంబు
నకుఁ జనుఁడు భావికార్యంబునకు వగచుచు
దొలఁగి చనె రాజు క్రమ్మఱఁగొలువునుండి.

ధృత—నాయనా! జనార్దనా! దగ్గఱకు రమ్ము. (కౌఁగలించుకొని.)

క. సుతుల నొకనూఱుగురఁ గాం
చితి జగముల నీడు లేని సిరి పెంచితి రో
గతి కానున్నదొ మాకుం
జితివిధి పాండవులచేతఁ జేయించెడవే

చ. కడుపెడుబిడ్డలం గనియుఁ గాలము తీఱిన వార్ధకంబునం
గొడుకుల నెల్ల బాసి తమకొంపకుఁ గూటికిఁ జేరు బన్న మే
ర్పడినను బ్రాణగొడ్డములు పల్కక మాదెసఁ గీడు గుంతితోఁ
గొడుకులతో సహింపు మని కోరితి నంచు వచింపుమా హరీ!

కృ—మామా! అల్లనఁబోకుము. నీకొడుకులుమాత్రము బలహీనులా? కుంతికే నీ యింటికి బొట్టకూటికయి వచ్చునవస్థ తటస్థించునేమో?

మ. గెలువ న్శక్యమె? కర్ణుఁ డేమి భుజశక్తిం జూడ సామాన్యుఁడే?
బలవంతు ల్గురుఁ డాపగాతనయుఁ డశ్వత్థామ మున్నైన యో
ధులు నీపుత్రుని కాజిఁ దోడ్పడక యెందుం బోమరే! యాఁగినం
గల నాపింపఁగ జూచి రింనుక పక్షంబున్న చందంబునన్.

ధృత—వాసుదేవా! చక్రధారి వగు నీవు చక్రరక్షకుండవై యుండఁ బాండవులకేమి కొదువ?

చ. సవసవగా శరంబులను జాల్చెద రంత్రియు కాని వీరిలో
నెవరికిఁ జేతు లాఁడు వధియింపఁగ బాద్ధుల? వారిలోనఁ గౌ
రవశతకంబు ఘోరసమరంబునఁ జిక్కనఁ జంపకుండ గా
నెవరు పరిత్యజించి దయ యెంతురు? చెప్పుము నాకుఁ గేశవా!.

కృ—

శా. లేదా! యింత వివాదమేల? యిచటన్ లేరా! మహాప్రాజ్ఞుల
య్యో! దుర్యోధనుఁ డింక తదుష్టుఁ డగు నే? యోగ్యేతరుల్వో లెవ్వా
రీదుశ్శాసను శాశనం గొనఁగా నేమంత వచ్చెన్? విడఁగా
రాదో! చంపఁగ రాదొ! దుస్తర్కాదుదనిర్దుర్యాను లో కార్థమై

భీష్ము—(జనాంతికము) వాసుదేవా!

ఉ. చెప్పితి నీవు మే మురక చెప్పితి మేమి యొనర్తు మింక? వా
    తప్పులకుప్ప కేఁడు మన దారికి రాక తొలంగె, వానికే
    త్రిప్పలు లేవు. సంధి యొనరింపమి చే మనబోటి వారికి
    న్ముప్పు ఘటించె నీ చెడుగు మూలముగా యదువీర! నేఁటికిన్.

అయినను గాలగతికిఁ దప్పువార మె! కుప్పకూరలుగా రణశకునంబు
    లుప్పతిల్లుచున్నవి. మాకు సెలవిమ్ము. ధర్మము దప్పకుండఁ గర్ణ
    ధారుఁడవై యీయోడ నడపింపుము.

సాత్య—(తత్తఱపాటుతో నిర్గమించి ప్రవేశించి కృష్ణునితోఁ
    జనాంతికము) అన్నా! ఇంతకు మున్ను దుర్యోధనాదులు చేసిన
    దురాలోచనమును నేనుగని పెట్టితిని. నీవు కడు జాగరూకుండవై
    యుండవలయు. నిన్నీ సభనుండఁగనుండఁ బంధింపవలయునని యోజిం
    చుచున్నారు. (చేతఁజూపి) అందులకు సూయోధనునియొద్ద నొక
    రజ్జువున్నది కనుఁగొనుము.

కృష్ణు—(అలక్ష్యభావముతో) తమ్ముఁడా! అవుగాక. నన్ను వీ రేమి
    యుం జేయఁజాలరు. సంశయింపకుము.

సాత్య—అన్నా! అట్లని యొప్పరికింపం జనదు.

ఉ. ఏ నొకరుండఁ జాలఁ గల నిచ్చటిదుష్టులకెల్ల; నింకఁ బై
    పై నరుదెంచు సేనఁ గృతవర్మ వధింపఁగలాఁడు ద్వారమం
    దానరసింహుతోడ నిదియంతయుఁ జెప్పితి నంచునిల్పితిన్
    వీని వధించి నేఁడె పృథివిన్ మనపార్థుల కిత్తు మగ్రజా!

దీనికి భీష్మద్రోణ కృపాశ్వత్థామలును సమ్మతించువారే. ఇందుల
    కేమందువు?

[అంతఁ గర్ణ శకుని దుశ్శాసనులు పగ్గములు చేతఁబట్టుకొని
వేఱువేఱు దిక్కులనుండి ప్రవేశింతురు.]

కృష్ణు—మన మిప్పుడు వీరిని వధింపరాదు. దానికిం గతము సావకాశంబుగా వచించెద. నీ వూరక చూచుచుండుము. వీరలెల్లరు పటాపంచలై పోవున ట్లొనరించెద.

సాత్య—(సన్నద్ధుండై యుండును)

భీష్ము...(తేఱిపాఱఁజూచి తనలో) ఔరా! చేటుకాలము! ఈధార్తరాష్ట్రాగ్రజుండు మున్ను తానన్న దుస్తంత్రమెల్ల నడిపించుచున్నాఁడు. కానిమ్ము. ఎవఁడు త్రవ్వుకొన్న గోతిలో వాఁడే పడుఁగాక

క. పదిలక్షలు కర్ణులు తోం
బదిలక్షలు శకునులును నృపాలకు లోక య
ర్బుదముం గదిసినఁ గృష్ణుని
పదరేణువ చాలు లీలఁ బరిమార్పంగన్.

సాత్య—(సంరంభముతో) ఓ విదుర గాంగేయాది నీతిధురంధరులారా! ఇదివినుఁడు.

చ. అదె కనుఁగొండు దుర్మదులహంకృతిశాలులు కౌరవుల్ సుదు
ర్మదులయి యగ్గిపై నుఱికి మ్రగ్గెడి కీటము లట్లు లన్నఁ "బ
ట్టుఁడ" మని యెంచి పొంచుచుఁ గడుంగడునక్కుచునున్నవారు చ
చ్చెదరిదె మీరలెల్లరు "ఛిసీ!" యనిరోయుచుఁ జూచుచుండఁగన్

(దుర్యోధనాదులు వేఱువేఱుగా నిష్క్రమింతురు.

విదు—(అదరిపడి చూచి) అన్నా! వైచిత్రవీర్య!

మ. శిశుపాలాంతకుఁ గంసమర్దను ద్విషత్సింహున్ మహారంభు దు
ర్దశపాల్గాఁగఁ దలంచి నీసుతులు గాంధారేంద్రుతోఁ గూడి స
ద్యశునిన్ గట్టఁ గడంగినారు, విలయంబై పోవు నీనాఁడె, యా
పశువుల్ హేతువు గాఁగ నీకులము విధ్వస్తంబు నీనాఁడె యా.

ధృత—(నిశ్చేష్టుఁడై యుండును.)

కృష్ణ—(భీష్మునిదిక్కై) తాతా! మఱున్నదీనందన!

శా. నాపైఁ గోపముఁ బూని నీమనుమ లున్మాదంబుమై వచ్చు నా
టోపం బెంతయు నొప్పఁగాక ననుఁ గట్టుంగాక రారాజు; మే
లే! పోని మ్మొకసుంతయాజ్ఞయిదు మీ పీగోపబాలుండు దా
నాపన్నుం డగునో! మఱేమగునో! యాద్యంతంబు వీక్షింపుమా!

ధృత—(తత్తరపాటుతో) తమ్ముఁడా! తత్క్షణము నీవరిగి యయ్యవినీ
తుల నెల్లనిక్కడికిన్ దీసికొనిరమ్ము.

విదు—(నిష్క్రమించి దుర్యోధనాదిసహితుఁడై ప్రవేశించును.)

ధృత—కుమారా! యేమి యీదుర్నయము.

మ. అనుజుల్ నీవును గూడి చావఁగఁ దలం పావిర్భవం బందెనే?
దనుజారాతి నెఱుంగవే? యతనిపై దర్పంబు వాటించెదే?
చెనఁటీ! యెక్కడిదుండగం బిది! యశశ్శ్రీప్రాణమానాపహం
బనఘాత్ముం డతఁ డల్గెనేని భువనం బల్లాడి చల్లాఱదే?

విదు—గాంధారేయప్రథమ! నా మాట కొంత యోజింపుము.

క. ఎంద ఱెదుర్కొని యేగతి
నందిరి? శ్రీకృష్ణుఁ డనఁగ నందఱితో నె
న్నం దగు మనుజుడే? చెడిపో
వం దలఁపూనకుము గోడునఁబడకుము వృథగా.

కృష్ణు—(దరహాసముతో) బావా? ధార్తరాష్ట్రాగ్రజ! యిటుచూడుము.

ఉ. ఒక్కనిఁ జేసి వన్నిచట నుక్కడఁగింపఁ దలంచినావె? నే
నెక్కడఁ బోఁ గలాఁడ నిఁక నిక్కడఁ జిక్కితిఁ బిక్కకై వడిన్
దక్కితి నీకుఁ, బట్టు మొగిఁ దక్కకు. మిట్టిటు చేరరమ్ము, బల్
చక్కనియూహ పుట్టె. ననుజన్ములతో నరుదెమ్ము పార్థివా!

(అట్టహాస మొనర్చును)

[దుర్యోధనాదులు కృష్ణునివంకఁ జూడలేక కనులు మూసికొని యతి
భయముతో గడగడ వణఁకుచుందురు.]

కృ—ఆ. వె. దివ్యదృష్టి యొసంగితిఁ దేఱిపాఱఁ
జూడుఁ డఘాత్ము లైన సంశుద్ధు లెల్ల
నిది నిజమ్ము నిజాకృతి యిదియ ముక్తి
దము తపశ్శాలురకును వదాన్యులకును.

[మునులును భీష్మవిదురద్రోణులును నానందపారవశ్యమును నటింతురు.]

ధృత—(తనలో) శ్రీహరి తననిజరూపంబు ప్రదర్శింపంబోలు! అక్కటా యీపాపాత్మున కిది దర్శింపరాదు గదా! అయినను వడిగి చూచెదఁగాక! (ప్రకాశము)

క. దేవా! దేవరయడుగులు
భావించి కనుంగొనంగ వాంఛించెద నీ
సేవకుఁడ నాకు దర్శన
మీవే యీవేడ్క దొరకు టీవేళఁ గదే.

కృ— నీకును దివ్యదృష్టి యొసంగితిని కనుఁగొనుము.

ధృత—(తేఱిపాఱఁజూచి)

చ. ఒకట నజుండు నొక్కయెడ నుగ్రుఁ డొకంటను విష్ణుఁ డొక్కెడన్
సకలసురుల్ మఱొక్కయెడఁ జంద్రదినేంద్రులు వేఱొకంట భూ
పకులు నొకంట యాదవులుఁ బాండవులున్ గనుపట్టుచున్న వా
రకటా! యి దేమిచోద్యమొకో! యద్భుతమీతని రూపమియ్యెడన్

(అంజలి ఘటించి) దేవా! విశ్వరూప!

మ. విలయాగ్నిప్రభ లెల్లెడన్ వెలిఁగెడిన్ విశ్వేశ! విశ్వాత్మ! యే
వెలుఁగుల్ దీనికి దీటుగాఁదగ వహో! వీక్షింపఁగా నేరరీ
వెలుఁగున్ సర్వసువర్వధూర్వహులు. పృథ్వీభారనిర్వాహ! మ
మ్ముల సైరింపఁగదయ్య! దుష్టమతులన్ మూఢాత్ములన్ గేశవా

(ఆశ్చర్యముతోఁ దనలో) ఏమీ! వాసుదేవుండు నాప్రార్థనము మన్నించి సర్వలోక భీషణం బగు తన విశ్వరూపము నుపసంహ-

రించినాఁడే. (నలుదెసలు పరికించి) ఈ మహామహుల నీక్షించిన యీదృష్టితోఁ బాపపుఁబ్రపంచ మేల జూడవలెను. (ప్రకాశము) వాసుదేవా! మహానుభావ!

మ. బ్రహ్మేశాదుల్ గనలేని నీదయిన చిద్రూపంబు గన్గొంటి నే
బహుపాపాత్మకుఁడైన పుత్రుకతనన్; భావత్కమారూపమున్
రహి నీక్షించిన కన్నులన్ బరుల నర్హంబౌనె వీక్షింపఁ? నీ
వ హరింపన్ గదవయ్య! నీ విడిన దివ్యజ్ఞానమున్ గేశవా!

కృ—మామా! నీ వెట్లభిలషించితివో యట్లే యయ్యెడుఁగాక. (భీష్మాదులదిక్కై)

శా. మేలున్ గీడును జెప్పి చూచితిరి మీ శ్రీమీయథాశక్తి, పెం
డాలంబందె కుతూహలంబు గలవాఁడై యుండె మున్మాటికిన్
గాలుం డాఁకొనియుండఁ బోలు! నెవ రాఁగన్ జాలువా రింక! నా
కేలా యిచ్చట జాల? మాజ్ఞ యిడుఁడా! యిందున్నవారెల్లరున్.

[లేచును.]

(భీష్మాదులు వెంబడిని లేచి నిల్తురు)

కృ—(ప్రయాణోన్ముఖుఁడై కొంతవఱకు నడచును.)

దుర్యోధనాదులు—(సాగనంపుచు నిష్క్రమింతురు.)

కృష్ణ—(భీష్మద్రోణులకై) నాకు ననుజ్ఞ యిండు.

భీష్మ—మంచిది. నాకీవిచారము మాత్రము బాధించుచున్నది.

క. గురులకు భక్తుఁడు శాంతుఁడు
వరుఁడు నిరతసత్యవాది నానాసుగుణ
స్ఫురణుండు వానితోడన్
దురమొనరుచుకన్న నొండు దుఃఖము కలదే?

ద్రో—వాసుదేవా!

ఉ. నాకరుణావిశేషము ధనంజయునిన్ బొనరించె సర్వలో
కైకధనుష్మదగ్రణిగ. నర్జునుతో నెవఁ డేని జాలఁడ
ప్రాకృతమూర్తి శాంతమతి వానియెడన్ బ్రియ మగ్గలంబు సూ!
నాకొమరుండు గాఁ డటులు నాకుఁ బ్రియుం డెటు సేతు నాలమున్?.

కృ—ఏమి చేయుదుము. అతనికిని నిదియె సంశయము. కాల మని వార్యము.

భీష్మద్రోణులు—(నిష్క్రమింతురు.)

కృ—(పరిక్రమించి నలుదెసలు పరికించి) తెనివి నగరివఱకంపి కర్ణుఁడు తన యవసథమునకు నేగుచున్నాఁడు కావున నితనితో మాటలాడుట కిదియే తగిన సమయము.

కర్ణ—(ప్రవేశించును )

కృ—(కర్ణుని జేసన్న చేఁ బిలిచి) రాధేయ! ఏకతంబున ముహూర్త మాత్రంబు నీతో మాటలాడ నాకవకాశ మొసంగుదువే!

గీ. ఎల్లి సూర్యోదయంబున నేగువాఁడ
నిట వసించెద విదురునియింట మావు
ఈవటకు వత్తువో! లేక యింటి కేను
వత్తునో? యాన తీఁగదవయ్య కర్ణ!.

కర్ణ—(తనలో) ఇతఁడు నా జననరహస్యముం గూర్చి మాటలాడఁ గలఁడు. (ప్రకాశము) తప్పక నీ వరుగుసమయమునకు వచ్చి కలసికొనియెదను.

కృ—మంచిది. (ఉభయులును నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింప
బడిన పాండవోద్యోగమునందుఁ
తృతీయాంకము

---

# పాండవోద్యోగము

## నాటకము

---

### చతుర్థాంకము

[కుంతియుఁ గృష్ణుఁడును బ్రవేశింతురు]

కృ—అత్తా! ఇఁక నాకు సెలవిమ్ము. కౌరవసభావిశేషము లన్నియు విచిటివిగదా!

చ. బవరము డాయవచ్చెఁ గురుసంశ మడంగుట నిశ్చయంబు, పాండవబలమే జయించు నన నావశమా! గురుఁ డాదియైన యోధవరులతో నెదుర్కొన సుధాకరశేఖరుఁ డైనఁ జాలఁడా హవ మొనరింపఁగా వలయునా? వలదా? వివరించి తెల్పుమా!

గీ. కొడుకుకొడుకులుఁ గోడండ్రుఁ గొడుకు లీవుఁ
గూడికొని పోయి పెనుగొండగుహాలలోన
దాఁగి యుండుఁడు బ్రదుకఁగాఁగాఁ దలఁతురేని
బ్రతికియుండినఁ దినవచ్చు బలుసుఁగూర.

కుంతి—దేవకీనందన! నీతల్లి చతురిమమంతయుఁ జూపించుచుంటివి. నామనోగతం బెఱుఁగ దలఁచి కాని నీవెఱుఁగవే? కొండగుహాల లోనే యుందురో! ప్రాసాదమందిరంబులలోనే యుందురో! సుక్షత్రియు లనిపించుకొనుటయే నాతలపు. కుంతిభోజునకు దత్తపుత్రినై చతురుదధివేలావలతం బగు ధరామండలం బేలిన పాండుభూపాలునకుం బత్నినై బలవంతులని పేరుగాంచిన యేగురు కొడుకులకుఁ దల్లినై దాయాదుల యింటఁ బమమూఁడేఁడులు కుడుచుచు బ్రతికియుండుటకంటె వనంబులలో నుండుట తక్కువగాదు.

అయినను నిర్భాగ్యురాండ్రకుం దార్కొనగాఁ గుంతి సౌందర్యవల దనియుఁ గార్యాలోచనంబుపట్లఁ బాంచాలిని గారవింప వలసిన దనియు ధర్మరాజుతో నొక్కి నక్కాణించి నే నింతకుమున్ను వచించిన విదులాసంవాదం బెల్ల బోధించి యెవని జన్మము శాత్రవ గర్వనిర్వాపణా సమర్థమో అట్టి పుత్రుని గన్నతల్లి యొకతల్లి గాదని నే నన్నట్లుపదేశింపుము.

కృ—మంచిది నీవు విలుపుము.

కుంతి—(నిష్క్రమించును.)

కృ—(పరిక్రమించి) ఏమీ! కర్ణుఁడు రాఁడయ్యెనే ?

తే. గీ. అన్నమాటకుఁ దప్ప డెట్లైన వచ్చి
తీరవలెఁ గాని వేఁకొండుతెరు గాదు

[ఎదుటఁ జూచి]

సూర్యుఁ డుదయించె నదిగో! తత్సుతుఁడు కర్ణుఁ
డరుగుదెంచెడిఁ దాను మున్నన్నపగిది.

కర్ణు—(ప్రవేశించును)

కృ—(కర్ణునిం దనచేతులతో దగ్గఱకుఁ దీసికొని) బావా! నీకొక పరమరహస్యంబు విని చెద సావధానముగా వినియెదవా!

కర్ణు—( చిఱునవ్వుతో ) నీ సంబోధనమువల్లనే తెలియుచున్నది. అయినను చెల్పుము.

కృ—తే. గీ. కన్నెప్రాయంబునందు భాస్కరునికరుఁ ణ
బదినెలలు మోసి నినుఁ గన్నపడఁతి కుంతి
చేరఁగాఁ దీసి నిన్నుఁ బెంచినది రాధ
నీవు రాధేయుఁడవు గావు నిశ్చయముగ.

నీవెఱుంగని ధర్మశాస్త్రంబులు లేవు. కానీను నకును సహోఢు కును దల్లిని బెండ్లియాడినఁవాడె తండ్రి యని చెప్పుదురు. కావున ధర్మరాజాదులవలె నీవును బాండవుఁడవే. దుర్యోధనుఁడు సంధి

మెఱింగియు నీయుదంతంబుఁ జెప్పి నిన్నుం బోడ్కొని పోదలంచు టయే నారాకకుం బ్రథమ కారణము.

ఉ. అంచితు లైదుగురు బంధువుల యందఱిముందఱఁ జెప్పి నిన్ను మె
ప్పించెదఁ, గుంతిచేత రవిచేత నిజం బని నీకు సాక్ష్యమి
ప్పించెద, ఫల్గుణ ప్రముఖవీరులు గొల్వఁగ నెల్లభూమి యే
లించెద నచ్చకీర్తివిమలీకృతసర్వదిగంతరంబుగన్.

గీ. మాతృపక్షము మేమెల్ల మమ్ముఁ జూడు
మనఘ పితృపక్షము యుధిష్ఠిరాదు లెల్ల
వారిఁ జూడుము నావెంట వారికడకు
రమ్ము మాయమ్మ యలర రాజ్యమ్ము గొమ్ము.

మఱియు నీకు ధౌమ్యులు వేదోక్తంబుగఁ బట్టాభిషేకంబు నెఱవునట్లొనరించెద.

మ. వ్యజనంబున్ ధరియించు ధర్మజుఁడు, దివ్యచ్ఛత్రముం బట్టు వా
యుజుఁ, డశ్వంబులఁదోలుఁ బార్థుఁ డభిమన్యుం డంకమందుండు, భూ
ప్రజలెల్లన్ జయువెట్ట నీకు జరుగున్ బట్టాభిషేకంబు, భా
నుజ! మాద్రేయులు ద్రౌపదేయులును నేనున్ యాదవుల్ వెంటరాన్.

ఇదియును గాక యొక్కవిశేషంబు చెప్పెద నాలకింపుము.

ఉ. ఏసతి వహ్నిలోన జనియించెను జన్న మొనర్చు వేళ, ము
న్నేసతి పెండ్లినాఁడు నృపులెల్లఁ బరాజితులైరి క్రీడిచే,
నేసతిమీఁది మోహమున నింతలు చేసిరి రాజు నీవు; ని
న్నాసతి పెండ్లియాడఁ గలదాఱవభర్తగ సూర్యనందనా!

కర్ణు—వసుదేవకుమారా! నాయందలి సౌహార్దంబున శ్రేయస్కామివై తెలిపిన యీ రహస్యము నాసహజకవచకుండలంబు లింద్రునకిచ్చునాఁడు సూర్యుని వలననే కొంచె మెఱింగితిని. నీవలన సమూలంబుగాఁ దెలిసెఁ గాని—

ఉ. సూతుని చేతికిం దొరకి, సూతకళత్రముపాలు ద్రావి, యా
సూతునియన్నముం గుడిచి, సూతకులాంగనయందు నందన

ప్రాతము గాంచి నేఁటి కొక రాజకుమారుఁడ నంచుఁ దెల్పి నా
చేతము సమ్మతించునె? యిసీ! యెవ దేగతి సిగ్గుమాలినన్.

క. లాలాస్వేదాదుల దా
నోలిన్ భరియించి నన్ను నోమినతల్లిన్
శీలవతి నంత్యకృషికిన్
బా లొనరింపఁగ యమున్నఁ బాడియె విమువక ?

ఉ. కామముచేతఁ గాని, భయకంపితచిత్తముచేతఁ గాని, యీ
భూమి సమస్త మేలుకొనుప్యానికచేతనె గాని నేను నా
సేమము గోరి చుట్టముల స్నేహితులన్ విడనాడి నేఁడు మ
త్స్వామి సుయోధను న్విడిచి వత్తునె? వచ్చిన మెత్తురే జనుల్ ?

చతురుదధివేలావలయితం బగు నీధరామండలంబున కంతకుఁ బట్టము
కట్టు కొందమను వేడుకయును నాకు లేదు.

శా. నానేస్తంబును నాబలంబు మఱియు న్నా పెంపు లోనమ్మి యే
భూనాథుండు దిటంబుగా రిపులతోఁ బోరాట మాసించె, నా
భూనాథు న్విడనాఁడగాఁ దగునె? శేషోమాషా చా నుంటి మే
నానం జెప్పెద నింతమాత్రమున కేలా యిట్టివా దచ్యుతా ?

గీ. "అర్జునుం డోఁడుఁ గర్ణున కనుచు జంకి
పన్నె నీ పన్నుగడ" యంచుఁ బ్రజలు నిన్ను
నన్ను "సూతిసుతుండు పాండవుఁడ నంచు
రోయ కేగె" నటంచు దూఱుదురు కృష్ణ !

పదమూఁడు సంవత్సరములనుండి సుయోధనుఁడు పేరుగా నేకచ్ఛ
త్రంబుగ నీభూమండలం బంతయు నేనే యేలితిని; కావున విషయ
సుఖంబులమీఁది యాసయుఁ దీఱిపోయె. కాకున్నను ఇంకొక
విశేషంబుగల దాలకింపుము.

ఉ. నాదుహితంబు గోరియె జనార్దన తెల్పితి వింతపట్టు, వా
రాదృతిమై నను గనుట యబ్బురమే భవదాజ్ఞ! రాజ్యసం

పాదన మే నొనర్చినను పార్థివుఁ డాధృతరాష్ట్రసూనుఁడే
కాఁ దగుఁ గాని యే నగుట కల్ల; భటుండెటు లేలికయ్యెడిన్.

నాకెట్టును రాజ్యార్హత లేదు. నేను దన కగ్రజుఁడ నని తెలిసినచో ధర్మమూర్తియగు యుధిష్ఠిరుఁడు రాజ్యం బొల్లక పరిత్యజించుట నిక్కువము. అట్లు జరుగుట లోకులకే కాదు నాకుఁగూడ నసమ్మతమే, ఏ మంటివా?

గీ. నిత్యసత్యవ్రతుం డన నెగడు ధర్మ
తనయుఁడే నేల నేలఁగఁ దగినవాఁడు
కురుపతిని గెల్తురే నెఱుంగుదును నిక్క-
వముగ నీదయచేత నే పాండుసుతులు.

మ. అరయన్ నేరనివాఁడ గాను నిను కృష్ణా! యుద్ధయజ్ఞం బొకన్
జరుగున్, దానికి హోత యర్జునుఁడు; స్రుక్సంపత్తి గాండీవ; మ
క్కురురాట్సైన్యము సంబ యాజ్య మగుఁ దక్కుంగల్గు సర్వాంబు నే
ర్పరి వీవే ఘటియింతు వేత్తవును నధ్వర్యుండవున్ గావునన్.

తే. గీ. అఖిల మెఱిఁగియుఁ బార్థుల ననఘమతుల
నట్లు సభ నాఁడు నే దూఱ నాడుటెల్ల
నలసుయోధనుప్రియమున, కది తలంపు
వచ్చి నామన మప్పుడు విచ్చి పోగులు.

ఇఁక నాకు సెల విమ్ము. ధర్మతనయున కీయుదంతము తెలుపకుండ నాకు వరమిమ్ము.

కృష్ణు—(తనలో) ఔరా! యీతని మనోనిశ్చయము! (ప్రకాశము) వికర్తనకుమార! సర్వజ్ఞుండ వయ్యును దొల్లి రావణునిగతి ననుకరించుచున్నాఁడవు. నాకేవో కొన్ని ముఖప్రీతికరము లగుమాటలు చెప్పి సురిఁగి పోదలంచు చుంటిని కాని నీకుఁ బూర్తిగా జయాభిలాష కల్గియున్న దనుట నేఁ గనిపెట్టితిని. ఈ మాట గూడఁ విని యూరకుందువుగాక.

శా. సేవాధర్మము గాన రాజ్యమును శాసింపంగ నేఁ జాల నం
ఘ్రీ వాడన్ జనునయ్య? జేనికయి యెందే నేగి యార్జించు నా
(శ్రీ) వాలింతఁగ రామి కొప్పఁ జను, నీ (శ్రీ) యేను నీకిచ్చు న
ష్టైవాఁ డాధృతరాష్ట్రసూతి గొనఁగా? నేమందు నీమాటకుణ్.

ఉ. పట్టి భిభీషికల్ సలుపు వైఖరి గాదిది; భీష్ముఁ దొట్టి మి
మ్మొట్టుల వేని బట్టి వధియించుట నిక్కువ; మట్టిసూచనల్
పట్టుగఁ బార్థులందుఁ గనుపట్టుచునున్నవి వేనవేలు, నీ
చెట్టతలంపు మాని దయసేయుము ధర్మజునొద్ద కొప్పఁగన్.

తే. గీ. అరిగెఁ గృతమును త్రేత ద్వాపరము జరిగె
నిట్టి కదనంబుఁ బార్థునియట్టి జోదు
నెందు నేరును జూచి మున్నెఱుఁగ రన్న
పగిదిఁ దెలియంగఁబడు జుమ్మి మగుడు మిటకు.

క. ఈవే కారణ మింతకుఁ
జావవు నీవొకఁడవే విశాంపతు లెల్లన్
నీవలన మ్రందుదురు నీ
సేవాధర్మమున కేమి? చెడు జగ మెల్లన్.

కావునఁ బికప విచారించిన లాభముండదు. మున్నే మేల్కొనుము. మాటాడకుము.

కర్ణు—నందనందనా! నీవాక్యంబులం దొక్కటియుఁ బ్రత్యాఖ్యానం బొనర్పఁ దగినది లేదు. సర్వమును నీవనినట్లే జరుగును. ఇంత గుఱుఁ తెలిసిఁగిన నీకుఁ గర్ణుని మనోనిశ్చయము మాత్ర మగోచ రమగునా? అట్లెఱిఁగియు నన్నేల నిర్బంధించెదవు?

చ. ఇపుడు తటస్థమైన పృథివీంద్రమహాప్రళయంబుపట్ల భూ
మిపతియుఁ దమ్ముఁడు న్మసుని మిత్రుఁడు నల్వురు వీరు కారకుల్
కపటము లే దొకింత యిటఁ; గౌరవనాశనసూచనల్ నిజం
బపరిమితంబుగాఁ గనఁగ నయ్యెడు నాకును నేమి సేయుదున్.

మ. మన మహోక్షులవంకకుఁ జనదు కర్ణుం బెట్టిదో! సారె చె
ప్పిన లాభం బిఁక లేను, కీర్తి కయి పృథ్వీనాయకుల్ పోరి చ
చ్చినఁ జాని మ్మిది భారతావనికి సుశ్రీ దెచ్చి దృష్టాంత మై
చనుఁగా కెన్నెడ మేటిసత్కృతుల వాచాశుద్ధికిన్ మూలమై.

కృష్ణు—(నైరాశ్యమును సూచించుచు)

గీ. పృథివికి వినాశనము సమీపింపఁబోలు
గానిచో నానుడుల్ మఱి నూననేర
నంతటి నికృష్ణుఁడే కర్ణుఁడు? (తల పంకించి పెదవి విఱచి)
అగు వినాశకాలమునఁ జెడ్డ మంచిగాఁ గానిపించు.

కర్ణు—(వినియు విననియట్లు నటించి) బావా! వసుదేవనందన!

క. సకలక్షత్రకులవినా
శకమగు నీసమరభరము సడలినపైఁ దీ
ఱికమై నిను దర్శించెద!
నాకా! స్వర్గమునందుఁ జూతు నాకా! లేకన్నన్.

నాకాజ్ఞ యొసఁగుము.

కృష్ణు—మంచిది.

కర్ణు—(నిష్క్రమించును.)

కృష్ణు—(తనలో) ఇఁక సంగర మెట్టును దప్పదు. యావచ్ఛక్తిని వినియోగించితిని గావున నన్ను లోకులు నిందింపరు. (పరిక్రమించి వెనుకఁ జూచి యోజించి) అవునవును. కుంతి యొకసారి యీతనికి నిక్కము బోధించినచో నితని వెఱ్ఱి కుదురునేమొ? (పెదవి విఱచి) వినఁడు.

క. జనని వచించిన నిక్కము
జనకుండు వచించినను "యశమొ చచ్చుటో" త
క్కనని తర మీతఁ డొల్లఁడు
కనుఁగొనఁ బ్రాణంబు తృణము గా దీతనికిన్.

చాలిమ్ము. ఇచ్చటి సభావిశేషములను విశేషించి కుంతి బోధించిన
నీతులను ధర్మరాజునకు దెలిపింతునుఁగాక! (నిష్క్రమించును.

కుంతి——(ప్రవేశించి తనలో) అక్కటా! నే నేమి సేయుదును? కర్ణుఁ
డర్జునునిచే మడిసినను నర్జునుఁడు కర్ణుచేఁ దెగినను నా కొకవిధ
మైన దుఃఖమే; కావున నెట్లైన బోయి బోధించి పాండవులం
జేర్తుఁగాక! (యోజించి) ఇది గాక యితఁడు తప్ప దుర్యోధను
సేనలోఁ బాండవుల కపకృతి చేయఁ దగు పేరుగల యోధులంతగా
లేరు. భీష్మద్రోణకృపాశ్వత్థామ లెన్నఁడును నా సుతుల యెడఁ
బ్రేమదప్పి వర్తింపరు. కావున వీని నెట్లైన ద్రిప్పి సుఖముండెదఁ
గాక! (పరిక్రమించి) అదె భాగీరథీతీరమునఁ గృతస్నానుండై
నాయగ్రతనూజుఁడు సూర్యోపాస్తి యొనరించుకొనుచున్నాఁడు.

[సమీపించును]

కర్ణ—— దేవీ! అతిరథసుతుండను రాధేయుడను నగు వసుషేణుండు
నమస్కరించుచున్నాఁడు.

కుంతి—(కౌఁగిలించుకొని) తండ్రీ! నీవు కౌంతేయుండవు గాని రాధే
యుండవు కావు. కుంతిభోజునింట నేను గన్నెనై యుండి దూర్వా
సుం డొసంగిన వరంబు పరిశీలింప దివాకరుం దలంచిన నతని ప్రసా
దంబు నాకు నిన్ననుగ్రహించె. నేను గౌలీనంబునకు జడిసి
నిన్ను గంగాజలంబుల విడిచితిని. సహజంబులగు కవచకుండ
లంబులుండుకతంబునఁ దండ్రీ కంటె వేయిమడుంగులు కాంతియందు
మిన్నవై యున్న నిన్ను వదలిన మహాపాపాత్మురాల నగు నా
యపరాధంబు మన్నించి నీతమ్ములతోఁ గలసి రాజ్యమేలు కొనుము.

(ఆకాశమునందు)

చ. నిజము కుమార! కుంతికి జనించిన మాట నిజంబు భాస్కరా
త్మజుఁడవు తల్లి చెప్పినవిధంబునఁ జేయుము రాజు లందఱుం
బ్రజయు ముదంబు నొందఁ గురుపాండవయుద్ధము మానిపించి ధ
ర్మజునకుఁ బ్రీతి గొల్పి యసమానయశోభరము న్వహింపుమా!

కర్ణ—పాండుమహిషీ! ఏను గుంతీనందనుఁడ ననుమాట నీవె కాక యాకాశవాణి కూడ స్పష్టపఱచెఁగదా! అయినను.

ఉ. కూటికి గుడ్డకై పరులకొంపకుఁ జేరి త్రయోదశాబ్దము
ల్నాటిన దుఃఖము ల్మఱి కలంపఁగ నుంటివిగాని "యిట్టి దీ
మాట" యటంచుఁ దెల్పితివె మానిని! యాత్మహితంబుఁ గోరి యీ
నాటికిఁ జెప్పవచ్చితివి నాపయిఁ బ్రేముడి కల్గుపోలికన్.

ఉ. ఇంచుకయైన లోఁ గరుణ యెంచక కన్నకుమారు గంగ క
ర్పించిన గొడ్డురాల విఁకఁ బ్రేముడి యెక్కడిదమ్మ నీకు? నా
యంచితమైన రాచకొల మాఱడిపుచ్చితి నూతధర్మము
ల్గాంచితి వీటఁబుచ్చిన కలం బిఁక వచ్చునె? సంధిఁ జేసినన్.

పంచపాండవులను వేఱుచేయుటనాయభిమతముగాదు. అదియునుం గాక

ఉ. చిన్నతనంబునుండి దయచేసి రమావిభవం బొసంగి నా
యున్నతిఁ గోరి నాపయి జయోద్ధతిఁ బూన్చిన రాజుకన్న నా
కన్నలుఁ దమ్ములుం గొఱుకు లాప్తులు నెక్కువ కాదు, వాని దీ
యన్నువప్రాణి వాని విడనాడుట నాపని గాదు మానినీ!

కుంతి—కుమార! పంచపాండవు లనుమాట వేఱుచేయుట నాయభిమతము కాదంటివే! కానిమ్ము. అట్లే నాకు వర మిమ్ము.

కర్ణ—పాండవజననీ! నీయభిమతం బొసంగితిని. నీవచ్చిన కార్యము సఫల మాయెఁ గదా! యిఁకఁ జనుము.

గీ. సమరమునఁ జేతఁ బడిదను జంప నేను
ఫల్గునుఁడు తప్పఁ జిక్కిన పాండుసుతుల
నేను మడిసిన నున్న వా రేగు రుందు
రతఁడు మడిసిన నాతోడ నైదుగురము.

కుంతి—(తనలో) అర్జునుఁడు వీనిచేతఁ జిక్కువాఁడు కాఁడు (ప్రకాశము) కుమారా! ఉపపాండవు లేవురపైఁగూడ దయయుంచుము.

కర్ణ---కురుకులవధూమణీ! ధర్మపుత్రాదులలోఁ గలియు మనుటతప్పఁ దక్కిన నీయభిమతమ్ములన్నియు నెరవేర్చెదను.

క. హరితో నరుదెంచెడి నరు
నరసి భయం బందినట్టి యుప్పార్థులతో
నరుదెంచెడి నన్నుంగని
పారిఁబోరి నవ్వుమరు శత్రుభూపతులెల్లన్.

[నిష్క్రమింతురు.]

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింప
బడిన పాండవోద్యోగమునందుఁ
చ తు ర్థా ం క ము.

---

# పాండవోద్యోగము.

## నాటకము

## పంచమాంకము

[పంచపాండవులును శ్రీకృష్ణుఁడును బ్రవేశింతురు]

ధర్మ—కృష్ణా! వసుదేవనందన!

ఉ. ఇంతకుమున్ను నీను కుపునెల్ల విశేషము లాలకించితిన్
జింత నశించె నాహవము సేయుఁ దలంపు ప్రదయించెఁ గౌరవ
ధ్వాంత మడంచి భూపతిపదంబు వహింపఁగ నిచ్చ పుట్టె న
ర్వాంతము కాక తీఱ నకటా! యెవ రాఁగఁగలారు దైవమున్?

భీము—అన్నా! దైవమేమి చేసె? అన్నిటికిని నకు్కురుకులపాంసనుం డగు సుయోధనుఁడే కారణము.

ఉ. వానిమదం బడంచి బలవంతుల వైరుల నెల్లఁ ద్రుంచి మున్
బూనుప్రతిజ్ఞలన్ నెఱపి భూమికి నిన్ బతిఁ జేసి యయ్యర
ణ్యాన వసించుచున్ గుడిచినట్టి మహావ్యథ లెల్ల గల్లగా
మానవతీలలామ కభిమానము నిల్పెద యాజ్ఞసేనికిన్.

[పటాక్షేపమున నొకపురుషుఁడు ప్రవేశించును.]

పురు— దేవా! జయము! జయము! తమ యాజ్ఞానుసారమున స్కంధావారమెల్లఁ జూచి వచ్చితిని. ఇరువాఁగును సర్వసిద్ధముగా నున్నారు. మఱియొక మనవి. కురురాజెందులకో గాని యులూకు నిచటి కంపుననువార్త నొక ఫణిహారివలన వింటిని. ఇంతట నంతట నతఁడును రావచ్చును.

కృష్ణ— నీవు పోయి యాఫణిహారి నిట కంపింపుము.
పురు—చిత్తము. (నిష్క్రమించును.)
ఫణి—(ప్రవేశించి) జయము జయము.
భీము—కౌరవసేనయందలి విశేషము లేమి?
ఫణి—సుయోధనుఁడునుగాఁ గురువృద్ధుఁడగు గాంగేయుఁ
డుభయసేనలందును నతిరథనిర్ణయ మొనరించునప్పుడు—
అర్జు—ఏమి జరిగెను?
ఫణి—కర్ణు నర్ధరథులలోఁ బరిగణించెను.
ధర్మ— ఈవిషయమునఁ దాతగారిదే లోపమనక తీరదు.

తే. గీ. అతఁ డర్ధరథుండైన నన్యుఁ డెవ్వఁ
డతిరథ మహారథాభిఖ్య లందువాఁడు?
తాతగారేలొకో యంత చేతఁగాని
వానిఁగాఁ గర్ణు నెంచి రనూనబలుని.

కృష్ణ—ఓయీ! అర్జును నేతరమునఁ బరిగణించిరి?
ఫణి—క. నరుఁ డీతరమున వాఁ డని
తరమే వర్ణింప నతనితర మాతఁడె తా
నరయంగ లేఁ డనిన నొం
డొరు లెవ్వరు నిర్ణయింతు రుర్వీస్థలిలో.

అని చెప్పిరి.
అర్జు—తాతగారీయెడ సూతపుత్రుని మాత్రమే కాక నన్నుఁ
గూడఁ బూర్తిగా నవమానించినారు.

క. పార్థుఁడఁట కర్ణుతోఁ దా
నర్ధరథునితోడఁ బోరునట యని మింటన్
స్వర్ధాము లాడుపలుకులు
వ్యర్థమనోరథుని చేయువా నన్నాజిన్.

కృ—దానికేమి! రేపటినుండి నిన్నెదుర్కొనువా రందఱును నతిరథ
మహారథ సమరథులే యగుదురా?

క. కొందఱు మహారథులు మఱి
కొందఱు సమరథులు మఱియుఁ గొంద ఱతిరథుల్,
కొందఱు నర్ధరథులు నీ
సందడి కయ్యమున నుంద్రు జనవరు లందున్.

నకు—అన్న తాత్పర్య మదికాదు. ద్వంద్వయుద్ధ మనునది సర్వ విధముల సమానులకే యేర్పడినది కాని, తదితరులకుఁగాదు. కావున నది విచార్యమే.

కృ—భద్రా! కర్ణు నర్ధరథులలోఁ జేర్చుటకు గాంగేయుం డేమి హేతువులు చూపెను!

ఫణి—ఇతని కింతకుమున్ను తటస్థించిన గురుశాపాదికము నుదాహరించి తనమాటలు దాను సమర్థించుకొనెను.

కృ—(ధర్మజునిదిక్కై) శాంతనవుని నిర్ణయము కడు న్యాయముగా నున్నది.

ఉ. అర్జునుఁ డన్నచో శివుని యాహవమున్ జవిఁ జూచినట్టి దోః
ఖర్జుఁడు నిర్జితాసురుఁ డఖండుఁడు; కర్ణుఁడు బాహునంపదన్
దుర్జయుఁ డైన నీయనఘుతోఁ దులయే! గురుశాపదగ్ధుఁ; డ
తూర్జితు లైననున్ విజయ మొందదు సూ! గురుశాపదగ్ధులన్.

ధర్మ—ఏమైనను దాతగారి యశశ్చంద్రునం దిది యొక కలంకము లోకు లనుకొనక మాన రని తలఁచెదను. (ఫణిహారిదిక్కై) కురు పితామహుఁడు త న్నర్ధరథులలోఁ జేర్చినందులకుఁ గర్ణుఁడు సమ్మతించి యిన్నకుండెనా ?

ఫణి—అతఁ డేల యూరకుండును! తోఁక ద్రొక్కిన త్రాఁచువలె నిట్టూర్పు నిగుడించుచు "నోయీ! పితామహ ?

మ. విను మే నర్థరథుండ నైన నగుదున్ వీరుల్ విచారింప నం
దున నన్నిన్ గొలఁగా నటంద్రు గడువృద్ధుం డంచు నిన్ జేఁడు మ
న్నన మైఁ జూచి వినిర్ణయుంపుఁబడవిన్ దార్కొల్పు నే తప్పుగా
ని, నినున్ జెప్పు మటన్న యప్పు డగు గా! నీయిష్టమే యిష్టమై.

క. వీఁ డెట్టి డైన నగు నీ
పోడిమి యాలమున నడఁగ బోవుదనుకఁ బో
రాడుటకు రాఁడు నీ పస
చూడఁ గలరు వీరలెల్ల శూరమ్మన్యా!

అని యస్త్రసన్యాసము గావించెను.

కృ—ఇది పునరుక్తి, అతని యస్త్రసన్న్యాసముమాట కేమిగాని—

ఉ. ముందఁగ భీష్ముఁ డీల్గు నని మోఱకుఁ డీతనిపోక చెప్పె, దీ
నం దెలియంగనయ్యె ఘటనందనుఁ డాపయి నీల్గు నంచు! మి
న్నందినవాఁడునుంబలె దురాగ్రహముల్ ప్రకటించు నీతఁ డా
ప్రమందక యుండువాఁడు? సుగమం బశుభం బని తేలె వారికిన్.

ధర్మ—అగుఁగాక! సూతపుత్రుని దురాలాపమ్ములకుఁ దాతగా రేమనిరి?

ఫణి—అనుట కేమున్నది! తత్కాలోచితమ్ముగఁ దనకున్ జనించిన కోపావేశమ్మునెల్లఁ జిఱునవ్వుగా మార్చుకొని "ఓయీ రాధేయ!

చ. నృపతి సమీక్షభార మిది నెత్తిని మోపినవాఁడు గాన నీ
చపలత నీకునీచతయు సాఁగుటకున్ దటి యయ్యెఁ గానిచోఁ
దపతపలాడు నీపదుచుతప్పుడుపౌరుష మేమి యౌనొ! నీ
ని ఫలితభావ మే మగునో నీ కెఱుఁగన్ బడకున్నె యింతకున్!

క. నీ వెంత నీకుఁ గల్గిన
చేవయు నది యెంత! నీవు సేయు సహాయం
బావంత గాదు నాకు ము
దావహమే! నీవు రామి యాహవమునకున్.

ప్రతిహారి—(ప్రవేశించి) జయము! జయము! శకునిపుత్రుండగు నులూకుండు వచ్చియున్నవాఁడు.

ధర్మ—శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

ఉలూకుఁడు—(ప్రవేశించును)

ధర్మ—(చేతఁజూపి) ఆయాసనము నధిష్ఠింపుము.

ఉలూ—(కూర్చుండి)

మ. వినుమా! యోయి! యజాతశత్రవ! మహావీరుండు దుర్యోధనుం
డనుపంగా నిట కేగుదెంచితి, నతం డాడంగ శాసించి పం
చినమాటల్ గల వొక్కకొన్ని, యవియే చెప్పంబడుఁ బ్స్మనీ
సును బోనాడి వినంగఁ బాడి యగు నీసోదర్యులున్ నీవునున్.

ధర్మ—దూతవై వచ్చిన నీపై గనలుటకు నే నేమి సుయోధనుఁడ ననుకొంటివా! నీధర్మమును నీవు సంపూర్ణమ్ముగ నెఱవేర్చికొన వచ్చును.

క. చేయఁ గలకార్య ముండినఁ
జేయన్ వలె ధార్తరాష్ట్రి శిక్షింపన లేఁ
న్యాయముగ రణమునం ద
న్యాయముగా దొక్కొ! దూతవగు నిను నొంపన్.

ఉలూ—దాని కేమి! యది విచారణాంతరము, ప్రకృత మనుసరింతము. నా మొగమున సుయోధనుం డనిపిన పలుకు లివి.

చ. సలుపుప్రతిజ్ఞలన్ నిలుపఁ జాల బ్రయత్న మొనర్పుఁ డూరకే
పలికిన లేదు లాభము, సభాసదు లందఱు మున్ వినంగ నీ
వలలుఁడు ప్రేలె నాతొడఁలు వ్రచ్చెద నంచును దుస్ససేను ప్రే
గులు మెడఁ దాల్చి శోణితము గ్రోలెద నంచును జ్ఞప్తియున్న దే?

(ప్రత్యేకించి పాండవులను గేలఁ జూపుచు)

ఉ. జోగినినాన నొక్కరుఁడు, సూపుఁడుగా నొకరుండు, పేడి వై
భోగపువిద్దె నేర్పుచు నపుంసకతాభర మూని యొక్కఁ డు
ద్యోగము వాజిశాలఁ గొని యొక్కఁడు; వేఱొకఁ డాలమందలోఁ
బాగతియూడిగంబుఁగొను బాలిశులొక్కొ! ననుఁ జయించుటల్.

ఉ. ఎవఁడు పితామహున్ దొడరు! నెవ్వఁడు ద్రోణు నెదుర్చు! నెవ్వఁ డా
హవవిధిఁ గర్ణు నోర్చు! నెవఁ డాఁగుఁ గృపు! న్గురుపుత్రుతోడఁ దా

నెవఁడని సేయునో? సరిగ నిప్పుడ చెప్పుడు నేర్పరించుకొం
డవల విచార మంతె ఫల మందదు రే పని ముందుఁ డందఱున్.

(భీమాదు లొకరి మొగము లొకరు చూచుకొనుచుఁ గోపావే
శము నటింతురు.)

కృష్ణు—(నివారించును.)

ధర్మ—ఇంకను జెప్పమనిన వున్నవా? సమాప్త మయ్యెనా?

ఉలూ—కలవు! వచించుచున్నాఁడను. అప్పుడే నీతమ్ములకు నాపై
నాగ్రహముదయించు గుఱుతులు కనుపట్టుచున్నవి. ఇంక ముందు
వీరు బొత్తిగా వినఁజాలరు కదా!

అర్జు—(చిఱునవ్వుతో)

శా. బావా! నీపయిఁ గోప మేమిటికి కటా! బ్రహ్మాస్త్రము న్దీయునే
యేవాఁ డేనియుఁ జాటకైరముపయిన్! హేయాతి హేయంబు గా
దే! వీరుం డటు చేసినన్; గడమ సందేహంబు లేకుండ వా
చా వైదగ్ధ్య మెఱర్పఁ జెప్పి కురురాజప్రీతి సంధింపుమా.

ఉలూ—(తనలో) అర్జునుని మాటలు నాకుం బోటులకన్న మిన్నలై
నాటుచున్నవి. అయినను నింకఁ గోపంబు కర్తవ్యంబు గాదు.
ధర్మజాంకుశంబునకుఁ దక్కిన మూఁడుగజమ్ములును లొంగినట్లు
భీమమత్తేభంబు లొంగదు. (ప్రకాశము) శేషము నాలకింపుఁడు.

ఉ. ఈరొకరాజపుత్రకుల రేని ధ్రువంబుగ నాజి నిల్చి మీ
బీరము చూపుఁ డర్జునుని పెద్దధనుస్సును వాసుదేవు నే
మారసి భాగ మిత్తు మని యాత్మఁ దలంచితి రేమొ! భీష్మునిన్
జేరిన యుత్తరక్షణము చేరెడిఁ గవ్వడి కాలుప్రోలికిన్.

మ. సభలోఁ బెండ్ల మనాథఁ బోల్కి వగవన్ శౌర్యంబుఁ జూపింపలే
ని భవాదృగ్రిపుసంతతిన్ రణములో నే నెట్లు సంధింతు! శూ
రభుపుల్ తాదృశకాలమందుఁ దమధైర్యస్థైర్యగాంభీర్యధూ
ర్వైభవంబుల్ బ్రభ దక్కినప్రముఖులై భీపింపు వాటింతురే?

(భీమాదులు మరలఁ దలలు పంకించుచుందురు.)

(కృష్ణుఁడు మరల వారించును.)

ధర్మ—(కొండఱగా) అయినదా! యింకను నుఱువవలయునా! భయము లేదు. దూతవు గదా! తుట్టతుదవఱకుఁ గానిమ్ము.

ఉలూ—ఇఁకఁ గొంచెము మాత్రమె యున్నది వినుండు.

ఉ. మాయలనూఱి, కొంపలను మాపు నుపాయము లెన్ని యెన్నియో
చేయఁగలాఁడు జ్ఞాతు లని సేయఁగఁ బన్నినవాఁడు మాధవుం
డే యిఁక మీకు దిక్కగుచేఁ; గృష్ణులు జిష్ణులు నెంద ఱెంద ఱే
మాయలు పన్నినన్ భయము మా కుదయింప దెఱింగి రండికన్.

అని సూత్రప్రాయముగా మీయెల్లరకున్ జెప్పు మనియె.

భీము—(పండ్లు పటపట గొఱికి మండిపడి) ఓయీ! దుర్ద్యూతరతతోక! కౌశికాపరపర్యాయాఖ్యాక! ఉలూక!

ఉ. దూతవు గాన నీపలుకుదుండగముల్ సైరించినాఁడ, నీ
నేతమదం బడంచునెడ నీవును దండ్రియు గ్రుడ్లనీటితోఁ
జూతురుగాక! యప్పటికి శూరుఁ డెవండును మిమ్ముఁ జూపి దు
ర్ద్యూతము నంపఁ దెంపి జముప్రోలికిఁ దోలక యూరకుండినన్.

ధర్మ—తమ్ముఁడా! యొరులకు బోధించుటకు బదులు నీవే కోపపడిన నిఁకగవంగా సైరించువారు?

కృ—(భీమునిఁ దన వెనుకకుఁ దీసికొని సకోపస్మితముతో) గాంధారరాజతనూజ! మీ ఱేనితో నామాటలుగా వచింపుము.

ఉ. చాపుధ్రువంబటం చెఱిఁగి చాపము శూరులు మెచ్చునట్టు లీ
చేవ రణాంగణంబు దయచేసినయప్పుడు చూపు టొప్పుఁ గా
కీవిధి నూరకే మొఱుఁగ నెవ్వరు నవ్వరె! చివ్వ యెల్లియే
కావుఁగ దత్తఱింపకుట కర్జమె! గర్జలు దుర్జయంబులే!

మ. విఱుగ న్గొట్టుట నిక్కమే యెఱుఁగు ముర్వీనాథ! నీయూరువుల్
సరిగాఁ గాపానరించుకొ మ్మనుజవక్షస్సీమ కౌక్షేయకా

క్షురధారన్ విదళించి శోణితము నాస్వాదించు నీభీముఁ; డె
వ్వరు మాన్యం గలవారో వారి నిపుడే ప్రార్థించి కాపుంచుమా!

ఊలూ—(తనలో) ఈమాటలు విని యూరకుండుటకన్న మానికిఁ
జావు కడుమేలుగదా! దీనికంతకను నెల్లి రణమ్మున నాయస్త్ర
శస్త్రములే ప్రత్యుత్తరం బొసంగుఁగాక! (ప్రకాశముగా) నే నికఁ
నరుగవచ్చునా?

ధర్మ—ఇదిగో! నరుగుదువు గాని. ఎవడురా! అక్కడ! చందనతాం
బూలాంబరాభరణాదులఁ దీసికొని రమ్ము. ఈగాంధారరాజ
తనూజుం గారవింపవలయు.

భటు—(తత్సహితముగాఁ బ్రవేశించును.)

ధర్మ—(అవి యిచ్చి గౌరవించును.)

ఊలూ—(పరిగ్రహించి ప్రయాణోన్ముఖుఁ డగును.)

అర్జు—ఓయీ! కవ్వడి యిట్లు చెప్పెనని మీరాజునకున్ జెప్పుము.

శా. వారున్నా రని వీర లుండి రని దుర్వారంపుగర్వోక్తులన్
నో రారన్ వ్యయ మేల చేసెదవు? నిన్నున్ బట్టి గాంగేయునిన్
బోరన్ జంపక మాన. మళ్లి గురులన్ పోకార్తు. మావీఁద ని
స్సారున్ గర్ణుని దోలు టెంతపని! వాచాశూరునిన్ భీరునిన్.

ఉ. వీర లవధ్యు లంచుఁ గురువీరుఁడు భీష్ము డవధ్యుఁ డందులో
ధీరుఁడు కుంభజుం, డతని దీటగువాఁడు తదాత్మజాతు డో
స్సార మపార, మల్లకృపుశౌర్య మవార్య, మటంచుఁ బొంగెదో
సారసనేత్రుఁ డండజీని జక్కఁగఁ బెట్టఁగలాఁడు లేఁడొకో?

క. ఒరుల భుజసారమే కద
శరణము నీ కాత్మబాహుశౌర్యౌదార్య
స్ఫురణంబు సున్న. నీకై
కురువృద్ధున్ గూల్పవలసె గురువృద్ధులతోన్.

ఊలూ—(కోప మడచుకొనుట నటించుచు నిష్క్రమించును.)

ధర్మ—(కృష్ణునితో) బావా! వసుదేవనందనా!

క. మును రుక్మి విరూపునిగా
నొనరించి రుక్మిణిని గొన్న యుక్తిపరుఁడ వీ
వని తోఁచెఁ బె నీరూపుని
గను నని నొనరించి లక్ష్మిఁ గైకొనలేమే?

భీము—బావా! మహానుభావ!

ఉ. ఏమనుచుఁ జూమ్మి జేఁడు; తనయెట్టెరుటన్ సహజుల్ తనూభవుల్
పోడిమి దక్క యాలమున బూడిదపా లయిపోయి సైన్యముల్
గూడ నశించి తాఁ బిఱువఁ 'గో' యనుతెంకయు లేక సర్వమున్
గాడయి తోఁచినప్పుడు వికావికలై యెద తల్లడిల్లఁగన్.

కృష్ణు—ఇంతయును నీభారతమునకు సూచనయే, అమాయికుఁడ వగు నీనోట వెలువడిన యక్కరములే నిక్కము గాకున్న మాయికుఁ డగు భగవంతుని మాటలు వేదములా నిక్కములు?

చ. ఎవఁడు దురాగ్రహమ్మునఁ బయిం బడుచెట్టఁ దలంపఁబోక కా
దవు ననుచింత సుంత మది నానఁగ లేక కృతఘ్నతాగతిన్
దవిలి మహోపకారులగు తమ్ముల నన్నను ధిక్కరించె న
య్యవినయుంపుగని జ్జెఱుపఁడా! భగవంతుఁడయో! సుయోధనునిన్

ఆ. వె. నాఁడు ఘోషయాత్రఁ బోడిమి చెడి చచ్చు
వాఁడె కాఁడె! తాను బాండవాగ్ర
జుం డమాయికుండు సుంత తమ్ముఁడటంచు
బలిమిఁ జేసి పార్థుఁ బంపకున్న.

ప్రతీహారి—(ప్రవేశించి) జయము! జయము! రుక్మియను విదర్భదేశాధి పతి దర్శనమునకై వచ్చియున్నాఁడు.

ధర్మ—(కృష్ణునితో) బావా! యేమనియెదవు?

కృష్ణు—(చిఱునవ్వుతో) శీఘ్రముగ రమ్మనుము.

ప్రతీ—(నిష్క్రమించును.)

రుక్మి—(ప్రవేశించును.)

ధర్మ—(సగౌరవముగా) ఈ యాసన మలంకరింపఁ బడుఁగాక !

రుక్మి—కూర్చుండుట కేమి! కూర్చున్నను గూర్చున్నట్లె, కూర్చుండకున్నను గూర్చున్నట్లే! (అర్జునుదకై)

చ. విజయుఁడ! నన్ను నీ వెఱుఁగవే! విజయ మ్మనువిల్లు నాది, మూఁ
డుజగము లేకమైనను జెదర్ జుమి వ్రేల్మిడి దానిచేత; నీ
గజగజ కొంత నేను విని కయ్యమునన్ గెలిపింప వచ్చితిన్
బుజములతీఁట వోఁగ రిపుపుంజముఁ ద్రుంచెద నిన్ భరించెదన్.

చ. భయపడి తీర్థయాత్రకు నెపం బిడి పోయెను బెద్దగొల్ల; నీ
కయి యితఁ డెట్టులో యనికినై చనుదెంచినవాఁడు గాని యే
మి యగును? నిట్టిగొల్లల కమిత్రులు జంకరు జంకి లేని ని
శ్చయముగఁ జెప్పు మే ననికి సాయముఁ జేసెద నిన్నుఁ గాచెదన్.

భీమ—(మండిపడి గద గైకొని) అరే! కృతఘ్న! యేమంటివి ?

క. ఈకృష్ణుఁడు నీశిరముల్
బోకార్పఁ దలంపఁ గరుణ పొంపిరి వో నిల్
జాకుండఁ జేసినందుల
కా! కృతిమున్ మఱచి కాఱు లఱచెద విట్టుల్ !

తే. గీ. మూఁడులోకమ్ము లేకమై మొనయుఁ గాక
యలహాలాయుధునకు జంకనంగ నెట్టి?
దోయనాత్మజ్ఞ! గురుదూషణోక్తికొక్క
మాఱు సైఁచితి నిఁక నొక్కమాఱు సైఁప.

కృష్ణ—(వారించి) ఏమీ! నీ కీవెఱ్ఱికోపము.

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
పుచ్చెడి వెఱ్ఱులును గలరె ముసలాయుధ నీ
పిచ్చి వెడంగెది యో యన
నచ్చునె లోకులకు వీనినాలుకయె చెడున్.

ఒక్కమాఱు కాదు. పదివేలసారు లన్నను నీ వీతనిపైఁ గనలకుము. నేనెందులకు మిన్నకుంటినో సుంత విచారింపుము.

భీమ—(ఆవేశముతో) నీవు రుక్మిణిం దలఁచి యున్న నొక దేబె నిందించినను విని సైరింతువు గాక!

మ. గురునిందన్ విని శిష్యుఁ డెవ్వఁడును శక్యుండైనచో నాజకున్
దురితాత్మున్ బరిమార్ప కుండిన గురుద్రోహంబు వాటిల్లు. నె
వ్వారు వారించిన నాఁగఁ డీతఁడు. రణప్రారంభమం దీదురు
ద్ధరణున్ జంపి గురుప్రియమ్ము ననుసంధానింతు ముమ్మాటికిన్.

రుక్మి—(తనలో) ఇతనిదురుక్తులు విని సైరించుట కడు భరముగా నున్నయది. వీఁడొక్కఁడేయైనచో నాకు జంకఁ బనిలేదు గాని తజిరైనచో వీరందఱును నాపై కుఱుకవచ్చును. (విననియట్లు నటించును)

అర్జు— అన్నా! గురునింద వినఁగూడదని నీవు నుడివినపలుకులు కడు లెస్సపలుకులు. అయినను నితఁడు మనకు సహాయం బొనరించు తలఁపున వచ్చినవాఁడు గావున నితనిని వధింప నుద్యమించుట యిహపరలోకదూరమగుఁ గాన సైరింపుము.

(రుక్మి దిక్కై)

చ. ఎఱుఁగవె? జ్ఞప్తి లేదె? తల నిప్పటికిన్ గలవేమొ నాఁటి యా
సురెనెఱగంట్లు. గడ్డమును జుట్టును మీసలు నాఁడునాఁటికిన్
బెరుఁగును గాని యేరికిని బీరము దాఁ బెరుగంగఁ బోదు నీ
తరము నెఱుంగఁజాల రని ధర్మజాతమ్ముల నాత్మ నెంచితే?

చ. అరులకు నేను భీతి వడినపుగదా! కరుణించి నీవు మా
ర్తురఁ బరిమార్పఁగాఁ గడఁగి తోడుగ వత్తు నటంటి తప్పెఁ జూ!
తరుణము. నాఁడు ఖాండవము దగ్ధ మొనర్చెడిపట్టునందు న
వ్వీరటునకై పెనంగునెడ విస్మృత మయ్యె భవత్ప్రతాపముల్.

[illegible]చ్చివచ్చినకడకున్ బోవచ్చును. నీసాయము మాకుఁ గాఁ బట్టను.

క. కలఁడిట కృష్ణుం డని సి
గ్గులచేటఁ దెలియ వకట! కొంకక నోరె
ట్టులు వచ్చిన నట్టులాకో
పలుకుట యాలోచనంబు వలవదె రుక్మీ?

రు:—(తనలో) నే నిప్పుడ పోయి సుయోధను సైన్యాధిపత్యమ్ము వహించి పీ రాడినప్రల్లదమ్ములకెల్ల భల్లములనె యుత్తరం బిచ్చెదఁగాక. (యోజించి) అతఁడు గూడ నన్ను వలదు పొమ్మనునేమో! అగుఁగాకఁ యేమైనను "నేను బాండవులకు భయపడినవాఁడ నన్నుఁ గాపాడు" మని యతఁడు నన్నుఁ బ్రార్థించిన నే యంగీకరింతును గాని లేనిచో నంగీకరించుట యసంభావ్యమే.

(నిష్క్రమించును.)

[ తెర లో ]

శా. జన్యాయాతపరశ్శతానుగతరాజన్యాయుతాధీశమూ
ర్ధన్యత్వప్రతిపాదకంబులు నగారాల్ మ్రోయఁగాఁజొచ్చె భ
ద్రిన్యాయంబునఁ బత్తు లార్చుచు ధరిత్రీజాతముల్ సేరె న
న్యోన్యంబున్ దెస లాడుమాటలన సైన్యారావ మొప్పారెడున్.

తే. గీ. ఎల్లి యుద్ధం బటంచు పీరెల్ల యెడలఁ
జాటుచున్నారు పడవాళ్లు స్వనము లెసఁగఁ
గృష్ణసారథికుండగు జిష్ణు రేపు
చూతు మనుకొనుచున్నారు సురలు చదల

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య:

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింపబడిన పాండవోద్యోగమునందుఁ

పంచమాంకము

---

# పాండవోద్యోగము

## నాటకము

---

## షష్ఠాంకము

[కృష్ణార్జునులు రథస్థులై ప్రవేశింతురు.]

కృష్ణ—(కేలఁ జూపి)

ఉ. కంటివె భీష్ము! నల్లగురుఁ గాంచితె! గౌతముఁ జూచితే! ద్రుప
త్కంటక! ద్రౌణిమోముకళ గన్గొను మల్లదె! సూతపుత్రుఁడో
క్కండఁ గురూద్వహుల్ గలసి కయ్యపుముచ్చట లాడెడిన్ సఖా!
బంటులఁ బోటుమానిసులఁ బాఱఁగఁ జూడు మపారసంఖ్యులన్.

అర్జు—(అనుత్సాహమును సూచించుచు) జగన్నాథ! పరాత్పరా
వతార !

ఉ. కొందఱు బందుగుల్, గురులు గొందఱు, గొందఱుతమ్ములింతలో
నందను లొక్క కొందఱు, గనం దగుపోణిమి నందువారు రా
జ్యేందిరకై వృథాగ మన మందఱ ద్రుంచఁగఁ జేసి యీశ్రియన్
డెందము రాయిగా సిరి గడించుటకన్నను బిచ్చ మొప్పదే !

సీ. ఏమంచు వాలమ్ము లేయఁగాఁ గల నొక్కొ
కలనొక్కొ పెదతాతగారితోడ
గురువుతో నేమంచు గ్రుద్ధులాడుదు నొక్కొ!
ఎద నొక్కొకింత కొం కొదవ దొక్కొ !
గురునకుఁ దరువాత గురుఁడైనకృపునితో
రిపునితోఁబలె మోహరింతు నొక్కొ !
ఇద్ధమైత్రీకుఁ దశ్వత్థామతో మామ
తో మద్రనృపునితోఁ దొడరు టొక్కొ !

తే. గీ. పెద్దతండ్రికుమారుల పెద్దనిష్ఠు
రించుకయుఁ గొంచ కితఁడు వీక్షించు టొక్కొ!
బాహ్లికాదిమహాకురుప్రభుల నెల్ల
భల్లముల నెట్లు దొర్లింపఁ జెల్లునొక్కొ!

కృష్ణ—(తనలో) ఈ భీష్మద్రోణాదిగురుపరంపరయు, బాహ్లికాది జ్ఞాతిపరంపరయు, నితని డెందమ్మున కిట్టిమందత నాపాదించుట యెుక యక్కజము గాదు. (ప్రకాశముగా) అర్జునా!

ఉ. ఇంతకుమున్న గాదె! నృపు నీవు రణమ్మున కాయితంబుగా
నెంతయు నొక్కి చెప్పితి, వి దేమిటి కింతటిలోనఁ దావకో
దంతము మారె! నన్నయును దమ్ములు సిగ్గుఱరొక్కొ! వైరు లీ
వంత రొకింగి రేని గరువంబులు వల్కరఁటయ్య! కవ్వడీ?

ఉ. చంపెడివాఁడు గాఁ డొకఁడు. చచ్చెడివాఁడును గాఁ డొకండు. దే
హంపుస్వభావ మిద్యది, భవాత్యయముల్ గనుచుండు జీవుఁ, డీ
దంపులమారికాయమును దద్దయు నమ్మక సంగుఁడై మనున్!
జం పొనరింపకే రిపులఁ జంపును నీవు నిమిత్తమాత్రమై.

ఈ రహస్యమును వినుము. (చెవిలో నేమో చెప్పును)

అర్జు—తత్త్వవిద్యోపాధ్యాయ! వార్ష్ణేయ!

క. కులధర్మాతిక్రమణము
కలుషావహ మన్నమాట కడు శ్లాఘ్యము యీ
యిలకొఱకై బంధుల నా
ర్యుల గురులఁ జంప నుల్ల మొల్లదు తండ్రీ!

ఉ. ఎందఱు రాజు లేలిరి మహేంద్రమహావిభవంబుతోడ ము
న్నెందఱు రాజు లేలుదురొ! యేరికి శాశ్వత మొక్కొ? దీనికై
బందుల వంశవృద్ధుల నృపాలుర నన్యుల దేశికాదులన్
ద్రుంచఁగఁ జేయుపాపులకు మంచిగతుల్ పరమందు గల్గునే?

క. ఏనొక నిమిత్తమాత్రము
గాని ధరాజాను లెల్లఁ గడతేరి రనం

గా నామది కెక్కద యది
సూనృత మెట్లనో తెలియఁ జూపు మనంతా ?

కృ—(తనలో) ఇతనికీ సందియము విశ్వరూపప్రదర్శనమ్మునం గాని నివర్తింపదు. (ప్రకాశము) అర్జునా! ఒకసారి కన్నులు మూసికొని మఱి చూడుము.

అర్జు—(అట్లొనరించి మహాశ్చర్యముతో)

ఉ. ఎన్ని మొగమ్ము లున్నవియొ యెన్ని భుజంబులొ యెన్ని రూపులో!
కన్ను లవెన్నియో! యకట! కానఁగ వచ్చెడి భీతి హెచ్చెడిన్
జిన్నలుఁ బెద్దలున్ గలను జేయఁగ వచ్చినవార లెల్ల నా
పన్నులు గాఁగ నీయనఘవక్త్రములన్ బడుచుండి రోలిమై.

దేవా! నాయజ్ఞానంబు నివర్తించినది. నీవు లోకక్షయకర్త వగు రుద్రుడవు కాని యాదవపట్టభద్రుండవు కావు. నీచేఁ జంపబడిన యీ భీష్మాదియోధులఁ బిష్టపేషణం బొనర్చుట నాయశంబునకుఁ గాని వేఱొండు కాదు. ప్రసన్నుఁడవై యీరూపం బుపసంహరింపుము. (అని కనులు మూసికొని ధ్యానించి తెఱచును.)

కృ—(చిఱునవ్వుతో) బావా! నే నెవ్వరు?

అర్జు—(సిగ్గుతో) నీవు యదునందనుఁడవు. మాపాలిటి కల్పవృక్షంబవు. శిష్టరక్షణదుష్టశిక్షణపరాయణుండవు లీలామానుష విగ్రహుండవు. తత్త్వమసీత్యాదివాక్యబోధ్యం బగు నాగమమూలకందంబవు నిన్నిదమిద్ధమని నిర్ణయింప నే నెంతవాఁడను? బంధుత్వకారణమ్మున నాయొనర్చు నపచారమ్ముల నన్నిటిని క్షమించి ప్రకృతకార్యాయత్తుండవై నాఁగ లెక్క మున్నిచ్చినవరంబు గరంబు నెఱవేర్ప ప్రార్థించెదను.

కృష్ణు—(రథము తోలుట నటించి దృష్టినించి) ఫల్గునా! అటు చూచితివా! మీయన్న నిరాయుధుండును నిస్తనుత్రాణుండును సాంజలిబంధుండును నై కౌరవబలమ్ములోని కరుగుచున్నవాఁడు.

వెనువెంటన భీమ నకుల సహదేవద్రుపదధృష్టద్యుమ్నాదు లు
జిచ్చపాటుతో నొకరిమొగము లొకరు చూచుకొనుచు
చున్నవారు. దే॥

[యథోక్తముగా ధర్మరాజు ప్రవేశించును]

అర్జు—(జిచ్చపాటుతో)

ఉ. "ఈనృపుఁ డింత బేలగునె! యిట్టిఁ డెటుల్ సమరావనీస్థలిన్
దా నడుగుంచె! నిందులకుఁ దమ్ములు సమ్మతి నొల్లఁజూపి! రం"
చాననముల్ నిగుడ్చి నృపు లందఱు వ్రేలిడి ముక్కుమీఁద నెం
తేనియు సంశయాంబునిధి నీఁదఁగ నన్న యదేమొ యేగెడున్.

కృ—అందులకున్ దగినకారణము నెనెఱుఁగుదును. అజాతశత్రుం
డన సామాన్యుండుగాఁడు. ఈ సంశయించు నృపాలుర కాతని
మనోవర్తనంబు గుఱుతింపన లవికాదు. మనముగూడ నట కేగు
దము రమ్ము.

(నిష్క్రమింతురు)

భీము—(అడ్డువచ్చి)

శా. అన్నా! యేమిటి కేడ కేగెదవు! దైన్యం బంద నీకేల? నీ
తెన్నున్ జూచి రిపుల్ వికావిక నగన్; దేవాసురుల్ వచ్చినన్
బన్నం బందక పోరు మమ్మెదిరి; నన్ బాఱంగ వీక్షింపుమా!
వెన్నన్ జూడుము! వెన్నుఁజూపకుము! బల్ విల్కాని బల్వెన్నుమా!

ధర్మ—(తప్పించుకొని నిరుత్తరుఁడై పోవును.)

నకు—(అడ్డము వచ్చి)

శా. ఏ నుండన్ భయ మేల? నీ కనికి రానీ! సర్వలోకమ్ములున్
గానీ యింక మఱేమి యైన మనకున్ గన్నాకు కృష్ణుండు లేఁ
డే? నేఁ డేమి పొసంగెఁ గ్రొత్త. విలుకాం డ్రెవ్వాని పే ర్విన్నమా
త్రానన్ మానముఁ బ్రాణముల్ విడుతు రాధన్విన్ నరున్ జూడుమా

ధర్మ—(యథాప్రకారమె పోవుచుండును.)

సహ—(అడ్డమువచ్చి)

న మొగ్గరమ్ములు “సెబా సిసి యే” మని ముక్కు(వేలితో
న్నను మమ్మునున్ దెగడ నీ కిటు రిత్త చనంగ నేల! యో
యన్న! కనం గదన్న! మము నాఱడి పుచ్చకుమన్న! యేటి కీ
బన్నపు సేఁత వెన్నునకుఁ బార్థునకున్ దలవంపు నింపఁగన్?

ధర్మ—(పోవుచుండును)

భీము—[మరల నడ్డమై]

ఉ. తాతను భీతిఁ జెందితివొ? ధన్వివతంసగురుండు ద్రోణుని
ఖ్యాతికి లోఁగిపోయితివొ? గౌతముతీవ్రత కోహటించితో?
చేతము ద్రౌణివిక్రమవిశేష మశేష మెఱిఁగి లొంగెనో
యాతతి నీ తెఱంగు గన నేటికి? నేఁటికిఁ గ్రొత్త యున్నవే?

భీష్మ—[ప్రవేశించి] ఓ సేనానాయకులార!

శా. కాయం బెన్నటికేనిఁ బోవునది యే కాయంబుం నాఁ జెల్ల దే
రేయో! ప్రొద్దుటనో యెనోపథమునన్ రేపేని యెల్లుండి గా
నీ యేరోగమొ మూఁడి చచ్చిన ఫలం బేమున్న! దాలంబులో
నాయుర్దాయము ధారవోయుఁడు దివం బందుం డనిందార్హులై.

భీము—[యోజించి] సోదరులారా! ఈయనఘు తాత్పర్య మిదమిద్ధ మని నిశ్చయింపరాకున్నను గురులన్ దర్శించి తదనుజ్ఞవడయుటకై యరుగుచున్నట్లు లూహింపనయ్యెడిని. నే నియ్యనఘుతో నున్నం జాలును గాన మీ రీయుదంతంబు మురాంతకునితో విన్నవించి కర్తవ్యంబు నిర్ణయింపుఁడు.

[నకుల సహదేవులు నిష్క్రమింతురు.]

ధర్మ—[భీష్ముని సమీపించి]

క. నాయక రహస్యకృతి నే
శ్రీయుత కీర్త్యబ్ధి శంభు శేఖరమణియే
భూయో భూయోఽపిచ గాం
గేయాయ నమో మహాత్మ గేయాయ నతే.

[నమస్కరించును.]

భీష్ము—[గుచ్చి కవుఁగిలించుకొని సంతోషముతో]
ఉ. వచ్చితి మేలు చేసితి. భవచ్చరితంబు ననారతంబు నే
మెచ్చుట కాక దేవతలు మెచ్చుదు, రన్యులు మెచ్చకుందురే?
వచ్చినమేటిమన్నఁడవు నాయన! నీ విటు రాకయున్న చోఁ
జెచ్చెర శాప మిచ్చియె జశింపఁగఁ జేయుదుఁ జుమ్మి మిమ్ములన్
క. పురుషుం డర్థమునకుఁ గిం
కరుఁ డర్థము పురుషదాసి గా దెన్నఁ డు; నీ
తరపున దుర మొనరించుట
తరువాయిగఁ గోరు మిత్తుఁ దగ నేదైనన్.
ధర్మ—(అంజలి ఘటించి)
ఉ. కోరుట కేమి యున్నయది! కొండొకకోరిక; ని న్నెదుర్పఁగా
నేరికి శక్యమా! దివిక నేగెడివారికిఁ దక్క; నాజ్ఞ యి
మ్మా'రణ మాచరించుటకు; నాదర మేదురమైనవృత్తి చె
న్నారఁగ దీననల్ సలుపుమా యసిలో జయ మందతీరఁగన్.
క. పెంచితివి, పెద్దఁజేసితి,
వంచితముగ మంచితివి, మహామహుఁడవు నిన్
గొంచక యెదిరించెడి యీ
కొంచెపుమానిసుల లోభగుణ మెంచకుమా
ఇఁక నొకమనవి (చెవిలోఁ జెప్పుట నటించును.)
భీష్ము—(చిఱునవ్వుతో)
ఉ. న న్నెదిరింపఁగా దగిననాయకుఁ డీభువనత్రయంబునన్
మన్న, వధించు టింక నెటు చొప్పదుఁ? జాపము మత్కరంబునం
దున్నవు డీపనిఁ సలుపనోపుట రుద్రున కేనిఁ గాదు; నేఁ
డెన్నఁగ దీనిఁ గోర దగ దిప్పటి కేగుము రమ్ము క్రమ్మఱన్.
ధర్మ—చిత్తము సెలవిమ్ము.
భీష్ము—పొమ్ము నీకు జయ మగుఁగాక! (దెసలు పరికించి) తేఁ డెం
దులకో నావంకఁ జూచుచున్నాఁడు. అట కేగెదఁ గాక !
( నిష్క్రమించును. )

ధర్మ—(తనలో) అట్లే ద్రోణులంగూడఁ బ్రసన్నులం జేసికొనినంగాని జయంబు సాధ్యంబు గానేరదు. (పరిక్రమించును)

ద్రోణు—(ప్రవేశించి) ఓయేకాదశాక్షౌహిణీపతులారా! సేనలారా!

చ. సలుపుఁడు యుద్ధ మించుకయు శాస్త్రవిరుద్ధము గాకయుండఁ, బే
ర్గలిగి చరింపుఁ డెయ్యెడలఁ, గయ్యపువస్తువు లంది యిచ్చువా
రల రణభేరికాచరపరంపరలన్ బయిఁ జూడవచ్చువా
రల నలయింపఁ బోకుఁడు, భర మ్మగుఁ జండపకీర్తి సేనికిన్.

ధర్మ—(తనలో) వీరే ద్రోణులు, (సమీపించి సాష్టాంగ నమస్కార మొనర్చి)

క. ద్రోణాయ! శిష్యకోటి!
త్రాణాయ! ధనుష్మదధికదర్పాపహార
ప్రాణాయ! శీఘ్రకల్పిత!
బాణాయ! నమోఽస్తు దేవ! భవతే! గురవే!

ద్రోణు—(లేవనెత్తి కౌఁగిలించుకొని)

ఉ. వచ్చితి మేలు చేసితిఁ భవచ్చరితంబు నవారతంబు నే
మెచ్చుట కాక దేవతలు మెచ్చుదు రన్యులు మెచ్చకుందు రే!
నచ్చినమేటిశిష్యుఁడవు నాకడ కీ విటు రాకయున్న చోఁ
జెచ్చెర శాప మిచ్చియె నశింపఁగఁ జేయుదుఁ జుమ్ము మిమ్ములన్.

(క. "పురుషుండర్థమునకు" అని వెనుకపద్యము చదువును.)

ధర్మ—అంజలి ఘటించి, 'ఉ. కోరుట కేమియున్న యది' అను వెనుకటి పద్యము చదువును.)

క. తద్దయు ననుగ్రహమ్మున
విద్దియ నేర్పితిరి, నేఁడు పీఁదులమై మీ
యొద్ద న్నేర్చినవిద్దియ!
లద్దిరె! మీమీఁదఁ జూపు టది సైఁపఁదగునె.

ఇఁక నొకమనవి. (చెవిలోఁ జెప్పును.)

ద్రోణు—(చిఱునవ్వుతో)

ఉ. నన్నదిరింపఁగాఁ దగిననాయకుఁ డీభువనత్రయమ్మునన్
నున్న, వధించు టెంక నెటు చొప్పడుఁ? జాపము మత్కరంబునం
దున్నపు డీపనిన్ సలుప నోపుట రుద్రున కేనిఁ గాదు. నీ
యున్నతి గోరువాఁడ నిపు డొప్పు నుపాయము సెప్పి పంపుటల్.

ఏను వినరానిమాట వింటినేని యస్త్రసన్న్యాసంబు గావింతు. దానిం జెప్పువాఁడు సత్యభాషాహరిశ్చంద్రుఁడై యుండవలెను.

క. ఎందులకుఁ గోరెదవు? గో
విందుఁడు నీపట్లఁ గలఁడు. వెఱ్ఱిపడకుమీ
చందం బయస్కర మగు
నెందును విజయంబు మీక యేర్పడి యుండెన్.

ధర్మ—(వినయముతో) దేవరయాశీర్వచనము శిరసావహించితిని. నమస్కారము. సెలవిందు. మఱియుఁ గృపాచార్యులను మేనమామయగు మద్రభూపతినింగూడ దర్శించి వారలయనుజ్ఞ వడసి యరిగెదను.

ద్రోణు—(తనలో) ఇతఁడు కడునుపాశాలి; రాజనీతిధురంధరత్వమునఁ గృష్ణుని తరువాత నితనినే చెప్పవలయును. కృపునిం గూడ వధోపాయం బడుగవలయు ననియు శల్యునికిఁ గర్ణసారథ్యంబు రాఁగలదని యెఱింగిన వాఁడు గావున నప్పట్లఁ దోచిన సాయం బొనరుపుమనియుం గోరఁదలంపుకయింపఁబోలు! నందులకై యరుగుచున్నాఁ డనుట ధ్రువము. అగుఁగాక. యెట్లును ధర్మమే జయించగలదు.

[ప్రకాశము]

ఉ. నీమదిఁ గల్గువాంఛితము నే నొక యింత యెఱింగినాఁడఁ జు
మ్మోమహితాత్మ! గౌతమునికొప్పదు మృత్యువునీపయిన్ దయన్
గోమలచిత్తుఁ డాతఁ డది గోరినమున్ సమకూర దూరకే
నేమిటికి ప్రయత్న? మిఁక నేగి సమీకము నిర్వహింపుమా.

ధర్మ—సర్వజ్ఞుల రగు తా మెఱుఁగని ధర్మములు లేవుకదా?

ఉ. అమ్మహితాత్ముఁ డట్టిఁడని యాత్మ నెఱుంగక కాదు. శాస్త్రదూ
ష్యమ్ముగుఁగాన నొజ్జయగు నయ్యనఘున్ బ్రణమిల్లి యాజ్ఞ మా
కిమ్మని వేఁడి దీవనల నిట్టులె కైకొని యేగువాఁడ. ద్రో
హ మ్మది యొజ్జపట్టున జయమ్మగునే! తగునే? కృతఘ్నతల్.

ద్రోణు—అట్లయిననట కేగి రమ్ము. (ధర్మజభీములు (నిష్క్రమింతురు)

ధర్మ[మరలఁ బ్రవేశించి తనలో] ఇక్కడికి గురుజనంబులనెల్ల నారాధించి వారి యాశీర్వచనమున్ బడసితిని. ఇఁకఁ గడమయేమున్నది [యోజించి] ఇట్లగు గాక. ఉపాయములలోనెల్లఁ దృతీయోపాయము విజయావహమని రాజనీతిధురంధరులు వచింతురు. కావున నందులకై గూడ యత్నించిచూచెదఁగాక! [ప్రకాశముగా బిగ్గరగా] ఓ కౌరవచమూపతులారా!

శా. నాకై యల్లసుయోధనున్ బోడరుసన్నాహంబు వాటించు వా
రీకౌరవ్యబలమ్మునందుఁ గలరే! యెవ్వారలే నున్నచో
నీకాల మ్మది దాఁటనీక డిపుడే యేతెండు నావెంటఁ లో
కైకత్రాణధురీణుఁడైన హరిమర్యాదన్ గనుం డింపుగన్.

యుయుత్సుఁడు—[ప్రవేశించి]

శా. అన్నా! యే నిదె వచ్చుచుంటి భవదీయ బైనపక్షంబు చే
ర న్నాకిష్టము మెండు నీ కయి రిపువ్రాతంబు ద్రుందింతు నా
జి న్నీవంటిమహానుభావునకునై జీవంబు వో నాడినన్
న్నన్ మెచ్చర రెల్లవారు పురుషార్థంబింత కొం డుండునే?

క. అవె నాసైన్యంబులు నీ
యవి నే నీవాఁడ నీకు నాహవమునఁ దో
డవుటకు నోఁచినమామక
భవ మతిపూతంబు సర్వవంద్యం బధిపా!

[illegible]—[సబహుమానముగాఁ గౌఁగలించుకొని]

తే. గీ. తమ్ముఁడా! రమ్ము పాండుపుత్రకులపంచ
తను తొలగింపు మార్గరు తనయు లింకఁ
గుంతికిని బాండునరవాలకున కటంచుఁ
జెప్పికొని లోక మిది సంతసించుఁగాక.

[ఇరుపురు నిష్క్రమింతురు.]

ద్రోణు—(తనలో) ఈధార్తరాష్ట్రులలోనెల్ల నీ యుయుత్సుఁడే శేషించువాఁడు. వీనియెడల శ్రీకృష్ణుఁడు సోదరభావము ననుగ్రహించుఁగాక! (చూచి) తెడెందులకో వారిదిక్కు చూచుచున్నాఁడు.

[నిష్క్రమించును.]

కృ—(ప్రవేశించి) ఉపాయశాలి యగు ధర్మజుఁడు విజయసాధనంబులఁ జక్కఁగ సంగ్రహించినాఁడు. కాని కర్ణుఁడు వీరింబలె నేనెంత యత్నించినను సుంతైనఁ జోటిచ్చినవాఁడు కాఁడయ్యె! ఇటీవల భీష్ముఁడు తన్నర్ధరథులలోఁ జేర్చెనను కోపమున నతఁడు యుద్ధ మొనరించు దినములలోఁ దా నుదాసీనుఁడై చూచుచుండుట కేర్పఱచుకొన్నట్లు విని యుంటిమి. కావున నతని నెట్లేని విఱిచి యాపక్షమున కీదినములలోఁ జేర్చుకొంటిమా! యితనిచేఁ గొంత వఱకుఁ గురుబలము నశించు ననుట కించుకయు సందియము లేదు. [యోజించి] కానిదుర్యోధనుఁడే తానుగాఁ దలంచునతఁడీపన్నుగడకు సమ్మతింపఁడు. [తలపంకించి] అగుఁగాక! "యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్రదోషః" [పరిక్రమించును.]

కర్ణ—[ప్రవేశించి] ఓ సేనాధిపతులార! యోధులార!

చ. శరణనువారిఁ గాని శరచాపవిహీనులఁ గాని భీతిమైఁ
బరుగిడువారిఁ గాని శరబాధకు మూర్ఛిలువారిఁ గాని త
త్తరపడువారిఁ గాని పరితాపపరీతులఁ గాని నిర్దయన్
బొరిగొనఁ బోకుఁ డట్టిక్రియఁ బోరుట నారక కారకంబగున్.

కృష్ణ—[సమీపించి జనాంతికము] బావా!

క. నిన్నర్ధరథులలోన మ
రున్నదితనయుండు చేర్చ రోషించితి వం
చు న్నిన్న వింటి నీకన్
జన్నే మన్నిని కస్త్రసన్న్యాసంబుల్ ?

చ. జరిగినదాని కేమి! యొకచక్కని త్రోవ వచింతు నూరకే
యరయుట శౌర్యవంతునకు నాలమునన్ గడు సిగ్గుగాదె? మా
కరివిజయమ్ము పట్టిన సహాయ మొనర్చినయట్లు లౌను నీ
కరి యగు భీష్మునిన్ దొడరినట్టులు నౌ జనుదెంతు వే యటుల్.

ఉ. ఇంతకుఁ దప్ప వేఱొకటి యేదియు లే దిఁక భీష్మమీఁద వి
క్రాంతిని నీవు చూపుటకుఁ; గయ్యము మీ కెటుసంఘటించు? నీ
స్వాంతమునందు నుంత గనుమయ్య! ధనంజయతుల్య నిన్ను దు
శ్చింతనుఁ డింత కొంచెపఱచెన్ సయిరించుట యొట్లు మానికిన్.

క. గాంగేయుఁడు చచ్చెడిదాఁ
కం గాంతేయులకుఁ దోడు గ న్మిట్టు నీవా
ప్పం గంటివేని ఋణవిము
క్తిం గందువు తల్లిపట్లఁ, దీఱును బగయున్.

కర్ణ—[తనలో] ఔరా! యీకృష్ణుఁ డెంతటిమాయావి.

ఉ. ఏ నలభీష్ముచేఁ బడిన నీతిని కిష్టమె, యమ్మహాత్ముఁ డె
ట్లే మదీయనాగశరకృత్తశిరుం డగు నేని దానికిన్
వీనికి సంబరంబె! నను వేఁదుఱుగాఁ దలపోసె నౌర్కౌ! యే
మైనను శక్తియున్ ఫణియు నర్జునుఁడక్క నొరున్ వధించునే!

[ప్రకాశము]

ఉ. చెప్పితి వుత్తరం బిడితిఁ జెచ్చెర నింతకు మున్న మొన్న, యీ
చొప్పివు డేల చెప్పెడి! శూరులుదూఱరె నన్నుఁ జూచి? యొ
ట్లొప్పుదు! నీశరీరము సుయోధనుపా లొనరించి దీని? కే
నప్పుడు కోపగించినను నాగ్రహ మున్నదె నాకు భీష్మపై ?

క. భీష్మాదుల వైరివీర
గ్రీష్మాదిత్యుం డతండు గెలువఁడె మీమీ
యూష్మములనెల్ల నలయు
గ్రీష్మాంశుం డడవి బూది చేసినభంగిన్.

కృష్ణ—[ఎకసక్కెముగా]

తే. గీ. వేయిమంది భీష్ములు పదివేలమంది
ద్రోణులును నూఱు వేలు కర్ణులును గలసి
వచ్చినను బార్థుచేతిలోఁ జచ్చువారు
కృష్ణుఁ డన నెవ్వఁడో సుంత యెఱిఁగికొనుము.

ఇస్సీ హస్తినాపురసార్వభౌమునిం జేయఁదలచి నాయొనర్చిన ప్రయత్నము నీయంతరాత్మయుఁ బరమాత్మయు దక్క నొరు లెఱుంగరు. నా యావచ్ఛక్తియు వినియోగించి నీమేలునకై దొరలితిని. ఇంక నావలన నీకుం గావలసిన ప్రియం బేమున్నది? అయినను నిట్లగుగాక.

[భరతవాక్యము]

మ. కలుగుంగావుత నీకుఁ దక్కు నృపభక్తశ్రేణియుం దాయుతుల్
గెలుచున్ గావుత ధర్మ మెన్నటికి. వాగ్దేవీమహాత్త్వంబు లి
క్కలికాలమున భారతాశ్రయములై కావ్యంబులై నాటకం
బులునై మాటలుఁ బాటలై వెలయుతన్ భూలోకమం దెల్లెడన్.

[అందఱు నిష్క్రమింతురు.]

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింప
బడిన పాండవోద్యోగమునందుఁ
షష్ఠాంకము.
సంపూర్ణము.

---

మోడరన్ ప్రెస్, రాజమండ్రి. - 1964

# హెచ్చరిక

కీ॥ శే॥ శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవులచే రచింపఁబడిన పాండవోద్యోగమును శ్రీకృష్ణరాయబారము, పాండవవిజయము మొదలగు నాటకములుగాని వానియందలి భాగములుగాని, నాటకకంపెనీలుగాని, నటీనటులుగాని తదితరులుగాని ఎట్టిపరిస్థితుల యందును కాపీరైటుదారుల తరఫున ఈదిగువ సంతకము చేసిన వారియొక్క లిఖితపూర్వకమైన అనుమతిని ముందుగా పొందనిదే ప్రదర్శింపరాదనియు, అట్టి అసమ్మతమగు ప్రదర్శనమునకు కారకులైన పాల్గొనిన ఆసామీగాని ఆసామీలుగాని [ప్రదర్శనమునకు చోటిచ్చిన హాలుఓనర్లుగాని] నష్టపరిహారమునకును మేము జరుపఁబోవు సివిల్ క్రిమినలు చర్యలకును బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియఁజేయడమైనది.

దివాకర్ల బ్రహ్మానందం

శ్రీ తిరుపతి వేంకటేశ్వర పబ్లికేషన్సు,

రాజమండ్రి

# మా యొద్ద లభించు స్టేజి నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాండవోద్యోగం | 1 | 12 | ఆంధ్రజ్యోతి | 1 | 8 |
| పాండవవిజయం | 1 | 12 | ధరణికోట | 1 | 8 |
| కన్యాశుల్కం | 2 | 0 | కనకతార | 1 | 8 |
| సత్యహరిశ్చంద్ర | 2 | 0 | పాషాణి (అహల్య) | 1 | 4 |
| గయోపాఖ్యానం | 1 | 8 | యన్. జి. ఓ. | 1 | 4 |
| ద్రౌపది వస్త్రాపహరణం | 1 | 8 | పాలేరు | 1 | 8 |
| తారాశశాంకం | 1 | 12 | జన్మభూమి | 1 | 8 |
| జయంతజయపాల | 1 | 8 | నాయకురాలు | 1 | 8 |
| భక్తతుకారాం | 1 | 8 | కొండవీడు | 1 | 8 |
| లవకుశ | 1 | 8 | రాజరాజు | 1 | 0 |
| కృష్ణలీల | 1 | 8 | నూర్జహాన్ | 1 | 8 |
| ఖిల్జీరాజ్యపతనం | 1 | 12 | దుర్గాదాస్ | 1 | 8 |
| విడాకులు | 1 | 8 | ఇదీలోకం | 1 | 4 |
| సారంగధర | 1 | 12 | ఎదురీత | 1 | 4 |
| చిత్రనళీయం | 1 | 12 | కాలేజిగరల్ | 1 | 8 |
| రామదాసు | 1 | 8 | రేనతి | 1 | 8 |
| శాకుంతల | 1 | 8 | మైరావణ | 1 | 8 |
| పాదుక | 2 | 0 | బాలనాగమ్మ | 1 | 8 |
| కోకిల | 1 | 8 | భక్తపోతన | 1 | 8 |
| బొబ్బిలి | 1 | 8 | కులంలేనిపిల్ల | 1 | 8 |
| సావిత్రి | 1 | 8 | వీరాభిమన్యు | 1 | 8 |
| రంగూన్ రౌడీ | 1 | 12 | అనార్కలీ | 1 | 8 |
| రాధాకృష్ణ | 1 | 0 | ఛత్రపతి శివాజీ | 1 | 8 |

—: వలయువారు :—

## దివాకర్ల బ్రహ్మానందం.

శ్రీ తిరుపతి వెంకటేశ్వర పబ్లికేషన్సు, రాజమండ్రి.